శ్రీః

# చిత్రతారకము

మూడంకముల నాటిక.

భమిడి సత్యనారాయణ శర్మచే

రచియింపబడి, ప్రకటింపబడియె.

కాకినాడ

రామారావుపేట



కాకినాడ : పట్టమట్ట శేషగిరిరావుగారి జార్జి ప్రెస్ యందు
ముద్రింపఁబడియె.

 [వెల 1-0-0

## ఇందు వచ్చు పాత్రలు

### పురుషులు

1. శ్రీరాముఁడు - ప్రఖ్యాతపురుషుఁడు.
2. లక్ష్మణుఁడు - శ్రీరాముని సోదరుఁడు.
3. సుగ్రీవుఁడు - కిష్కింధప్రభువు - శ్రీరామ మిత్రుఁడు.
4. అంగదుఁడు - వాలికుమారుఁడు - యువరాజు.
5. ఆంజనేయుఁడు - సుగ్రీవమంత్రి - శ్రీరామభక్తుఁడు.
6. ప్లక్ష ప్రభావులు - సుగ్రీవామాత్యులు ఇరువురు - ఇతర కపులు - పరిచారకులు - ద్వారపాలురు - సేవకులు.

### స్త్రీలు

1. తార - కథానాయిక. వాలిభార్య - వాలియనంతరము సుగ్రీవుని జెందెను.
2. రుమ - సుగ్రీవునిభార్య.
3. అజముఖి - పరిచారిక. ఇతరపరిచారికలు.

శ్రీరస్తు

చిత్రతారకము

# కృతిసమర్పణము



ఉ. తల్లిని తండ్రి నెల్లెడల - దైవము లంచుఁ దలంచి యుద్ధరం
జల్లని కీర్తివాహినుల - జాహ్నవివోలఁగ నిల్పె రాముఁడే
నెల్ల ఋణంబు దీర్పనిటు - లీకృతి బ్రహ్మయ సర్వమాంబలన్
సల్లలితంపు భక్తిఁగని - సత్కృతి నర్పణసేతు వారికిన్.

చ. అగణిత శక్తియుక్తుఁడగు - నారఘురాముని సాటిఁ జెందనే
సుగుణము లేదు నాకునిఁకఁ - జూడఁగ నన్నియు దుర్గుణంబులే !
మిగిలిన దొక్కటే ! భువిని - మేలగు మానవజన్మ మబ్బుటం
దగితిని చిన్నికబ్బమునఁ - దర్పణసేయఁగ తల్లిదండ్రులన్.

క. భారద్వాజస గోత్రుఁడు
గారవమొప్పంగ భమిడి - ఘనవంశజుఁడీ
తారక చిత్ర చరిత్రను
తా రాసెన్ భువిని చంద్ర - తారార్కముగాన్.



# తొలి పలుకు

ఈ నాటకకర్త శ్రీ భమిడి సత్యనారాయణశర్మగారు శ్రీమద్రామాయణమును మథించి యమృతమయమైన పెద్ద విమర్శనమును సంతరించిరి. ఆసమయమున వారి హృదయమున బొంగిన భావలేశమే యీరూపకరచనమునకుఁ గారణమయ్యెను; ఈరూపకరచనమునఁ దాముద్దేశించిన ప్రయోజనములు శ్రీశర్మగారే వివరించియున్నారు. వారావిషయమునందు నిశ్చయముగాఁ గృతకృత్యులైరని చెప్పుట కెంతయు సంతసించుచున్నాను,

ఈరూపకరచనమున శ్రీశర్మగారు కొంత క్రొత్తఁదనమును వెలయించినారు. నాటకలక్షణములు తెలిసిన వారి కావిషయము గోచరింపకపోదు. ఒక్కవిషయమును మాత్రమిందుఁ బ్రశంసించెదను. శ్రీశర్మగారు ఈనాటకమునకు "చిత్రతారక" మని పేరు పెట్టిరి. "తార" పాత్ర యిందుఁ జిత్రముగాఁ జిత్రింపఁబడుటచే దీనికి "చిత్రతార" మనుపేరు వచ్చెను. స్వార్థమున "కప్" ప్రత్యయము వచ్చియది "చిత్రతారక" మయ్యెను. మఱియు "తార" యిందు చిత్రిణీజాతి స్త్రీగా వర్ణింపఁబడుటచే "చిత్రతారక" శబ్దముచే నావిషయముగూడ సూచింపఁబడెను. "తారకుఁ" డనఁగా తరింపఁజేయు వాఁడని యర్థము. ఇందు రాముఁడు లక్ష్మణసుగ్రీవాదులను "వారి మనోదౌర్బల్యముల నుండి" చిత్రముగాఁ దరింపఁజేయుటచే నతఁడు చిత్రతారకుఁ

డయ్యెను. ఆతని నధికరించి వ్రాసిన నాటకమగుటచే దీనికి “చిత్రతారక”మను పేరును ప్రసంగించున్నది అదియునుంగాక యీనాటకమున నన్నిపాత్రలకంటె స్త్రీపాత్రియగు తారకు ప్రాధాన్య మొసంగఁ బడెను. ఆమెతోడి వాగ్వాదమున లక్ష్మణున కూపిరాడలేదు ! ఆమె వాక్చాతుర్య భావగాంభీర్యాదులచే యుక్తియుక్తముగ దనభర్తను రక్షించుకొనుటయు కాక శ్రీరామకార్యమును గూడ సాధించుటలోని నేర్పు మనస్త్రీలకుఁ గూడ విషమపరిస్థితులు దమ్ము తార్కొనునప్పుడెట్లు ప్రశాంత చిత్తముతో నెదుర్కొనవలయునో చెప్పుచున్నది. సతులీలోకమును గాల్చెడియగ్నులని నమ్మిన లక్ష్మణుఁడు సంభాషణాంతమునఁ “దారకు” గేలుమోడ్చెను! స్త్రీలయెడ లక్ష్మణునకుఁ గల తీవ్రప్రతికూలతను బోఁగొట్టుటలోను, సుగ్రీవుని గార్యతత్పరుని గావించుటలోను శ్రీరాముఁడు, తారయు నిరువురును గారణమైరి. కావున వారిరువురి పేర్లకు సమన్వయించునట్లు “చిత్రతారక” మని యీనాటకమునకుఁ బేరుపెట్టుట మిగుల సమంజసముగ నున్నది.

శ్రీశర్మగారు రామాయణ తత్త్వమును వెలువరించు నిట్టి నాటకముల మఱికొన్ని వ్రాసి యాంధ్రావలి యామోదమును బొందుదురు గాక యని యాశించుచున్నాను.

చతుర్వేదుల సత్యనారాయణ M. A., B. O. L.

**25–8–54.**

# విజ్ఞప్తి

ప్రపంచములోని వాఙ్మయములకెల్ల మకుటప్రాయమనఁ
జెల్లు సంస్కృత వాఙ్మయమునం దాదికావ్యమగు శ్రీమద్రా
మాయణము నెఱుంగనివారులేరు. దానియందు సర్వమానవ
లక్ష్యములగు ధర్మార్థ కామమోక్షములను శ్రీరామచంద్రుఁ
డెటుల సాధించెనో యతినైపుణ్యముగ రసవత్తర కావ్యరూప
మున వాల్మీకిమహర్షి నిరూపించెను. రామాయణమును జదు
వుకొని యందుఁ జిత్రింపఁబడిన నాయా మానవజీవిత పరమార్థ
ములను సాధ్యమైనంత వఱకనుసరించుచుఁ దమ జీవయాత్రలను
సాగించుకొనిన మహానుభావులలో నవయుగమున నిరువురు
చారిత్రక పురుషులు కానవచ్చుచున్నారు. శ్రీరాముని చరిత్ర
మును మోక్షలక్ష్యముగఁ బఠించి తన యనుభవములను లలిత
సంగీత కళారూపమున లోకమున కందించినవాఁడు త్యాగయ్య.
నాఁటి రామరాజ్యమును నేఁడు మరల భారతదేశమునందు
నెలకొలుపవలెనను పూనికతోఁ దన జీవితనౌకకు సత్యము,
నహింస, త్యాగమునను చుక్కాని, తెరచాప, పలకోలల
నమరించి ప్రేమతత్త్వమను పాల మున్నీట నడుపనెంచిన కర్ణ
ధారుఁడు గాంధిజీ! "ఎందరో మహానుభావు" లనినట్లు తులసీ
దాసు, తుకారామ్, కబీర్, రామదాసు మున్నగు మహా
త్ములు శ్రీరామనామ మహత్త్వమును జాటిన పెక్కండ్రు
ముముక్షువులు లేకపోలేదు. వారు రామచంద్రుని కేవల భగవ

వతారముగను భగవంతునిగను గ్రహించిన భక్తులు. "యే యథామాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహ" మ్మను భగవద్వాక్యమును పాటించి యాతఁడట్టి ముముక్షువుల వారు కోరిన నిరతిశయానంద సామ్రాజ్యపట్టభద్రులఁ గావించెను. కాని పైఁ బేరొ్కనఁబడిన యిరువురును "నాఽహమగ్రవరో దేవి లోకమావస్తుముత్సహే। విద్ధిమామృషిభిస్తుల్యం కేవలం ధర్మ మాస్థిత" మ్మను శ్రీరామ వాక్యమును తమ నిత్యజీవితము నందుఁ బ్రకాశింపఁ జేసిన కర్మయోగులు.

శ్రీమద్రామాయణమునందలి "వాల్మీకి రాముని" మనము కేవల భగవంతునిగనె యర్థము సేసికొనఁదలంచినచో నా సుప్రసిద్ధగ్రంథ మొక చరిత్ర యనుటకు వలనుపడదు! దానిని శ్రీరాముని జీవితచారిత్రముగ గూడ మనము గుర్తింపకున్న నా కావ్యమొక యపూర్వ రసనిష్యందియగు ఫలమై మానవుఁ డాస్వాదించి తన జీవితమును ధన్యమొనరించుకొనుట కంతగ సహాయపడక నొక యాపాతరమణీయమగు కృత్రిమకుసుమము వలె నది నిలచి మన పేటికల నలంకరించుకొనుటకు మాత్రమె పనికివచ్చెడిది. నారదమహర్షిని బ్రశ్నించునప్పుడె "కోన్వస్మిన్సాంప్రతంలోకే" యనియు, "చారిత్రేణచకో యుక్తః" యనియు నా కవివర్యుఁడు తన గురువర్యు నడుగుటఁ జేసియు, శ్రీరామ చంద్రుని జీవితాదర్శము ప్రతిక్షణము నీక్షించుచు తమ జీవితములఁ గూడ నట్లు దిద్దుకొనుచు వచ్చిన మహాత్ములు పెక్కం డ్రుండుటచేతను రాముఁనొక చారిత్రక పురుషునిగ మన మెన్నినఁ దప్పులేదు. ఇఁక శ్రీరాముని జీవితమును దైవసంఘటిత

ముగ వాల్మీకి నిర్వర్తించుటలో దైవమానుష శక్తుల సమన్వయము గావించి వేదవిహితధర్మమును తప్పక యనుష్ఠించుచుఁ దమ లోకయాత్ర నప్రమత్తులరై నడుపుకొను మానవులు దైవ సంపద్విశిష్టులనియు, నట్టివారి కీశ్వరసత్త తనంత నావిర్భవించు ననియుఁ జూపుటా మహర్షి రచనకుఁ బరమార్థము! అట్టి శుభాశయమె రామాయణ మహాకావ్యనిర్మాత పరమలక్ష్యము.

వేదవిహితధర్మములను వీడి కేవల ఫలసంపాదకములగు కర్మలకొఱకుమాత్రమె తామస తపంబు లాచరించుచు శరీరస్థమైన భూతేంద్రియ గ్రామంబుల హింసింపసమకట్టి యట్టి కామ్యకర్మలవలనఁ గలుగు సుఖభోగంబుల కంతరాయ మిత రులు గావింతురేమోయని యహర్నిశము లులుకుచు వానిని నిరంతరమనుభవించుటకై లోకోద్వేజకరమగు మారణయంత్రముల సాధించి లోకభయంకరముగ ప్రవర్తించువారె రాక్షసులని యామహర్షి తన కావ్యరచనచే నిర్వచించెను. రామాయణసారము నవగతమొనరించుకొనిన భర్తృహరి తన నీతిశతకమునం దీరీతిని నాలుగువిధములగు పురుషులను నాల్గుయుగము లందుఁ జూపట్టుచున్న ట్లుగ్గడించియున్నాఁడు.

శ్లో॥ యే కేసత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థముద్యమభృతస్స్వార్థాఽవిరోధేన యే।
తేఽమీమానవ రాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నంతి యే।
యేతుఘ్నంతి నిరర్థకంపరహితం తేకే నజానీమహే॥

పైశ్లోకమున శ్రీరాముఁడు సుగ్రీవునితో సఖ్యమొనరించునపుడు తనభార్యను మరల దెచ్చుకొనుటకై సుగ్రీవుని సహాయ్యమపే

క్షించి తనకార్యమున కవిరోధముగ మిత్రునికార్యమును సాధిం చుటజేసి యా త్రేతాయుగపురుషుడగు రాముడు సామాన్య మానవధర్మమును పాటించి తన మనుష్యత్వమును సార్థకపఱచె నని భర్తృహరి సూచించియున్నాడు. కాని శ్రీరాముడు జితేంద్రియుడును పరమసాత్వికుడు నగుటచే దనకు విశ్వామి త్రాది మహాత్ములచే నీయబడిన దివ్యాస్త్రసంచయమును తుచ్ఛములగు నైహికసుఖభోగములకై యుపయోగింపక దుష్ట శిక్షణ శిష్టరక్షణావసరములందె వానిని వినియోగించెను. తన తపోబల మాయాబలసామర్థ్యములను వేదజ్ఞాన ప్రతిభా విశేష ములను రావణుడెట్లు తన కామ్యసుఖములకై యుపయోగిం చెనో జగద్విదితము !

ప్రకృత మీ కర్మభూమియందలి జనుల "జీవన" ప్రమా ణమును (Standard of living) పెంచుటకు మన పాలకులు విశ్వప్రయత్న మొనరించుచున్నారు. రామాయణపరమార్థ మును రామరాజ్యపద్ధతులను బాగుగనవగాహనముచేసికొనిన గాంధీమహాత్ముడెట్లు తలంపక ప్రజలు తమ "జీవిత" ప్రమాణ మును (Standard of Life) ముందుగ నుత్తేజింప సమకట్టినం గాని కేవల "జీవనప్రమాణము"ను పెంపొందించిన నంతమాత్ర మున నయ్యది నియతమగు నవధిని నిలువక

శ్లో॥ "న జాతుకామః కామానాముపభోగే న శామ్యతి॥
హవిషా కృష్ణవర్త్మేవభూయ ఏవాభివర్ధతే" (మనస్మృతి)

యను "మానవ" వచనము ననుసరించి, మనుజుడు స్వర్గభోగ ములన్నిటి నీ లోకముననె గాంచిన నంతటితో తృప్తిజెందక

సి లోకములోని బంగారము, నీ సృష్టియందలి సుందరవస్తుజాల
ములు దానె గ్రహించి యనుభవింపవలెనను నిరవధికతృష్ణకు
లోనై యందుకొఱ కందఱిపైన తానె ప్రభుత్వము వహింప
వలెనను దురాశయము ప్రబలి, తపోయాగాదు లొనరించి
"బ్రాహ్మణస్యశరీరం తు క్షుద్రకామాయనేష్యతే। కృచ్ఛ్రేణ
తపసాచేహ ప్రేత్యానంత్యాయకల్పతే" యను భగవద్వాక్య
మును వీడక తనవిజ్ఞానసంపదచే లోకకళ్యాణ మాచరింపవలసిన
బ్రాహ్మణుండగు రావణబ్రహ్మ భోగపరవశుఁడై క్షత్రియవృత్తి
నవలంబించి తుదకు లోకకంటకుఁడుగ నెట్లుమాఱెనో, యట్లనె
ధర్మార్థకామమోక్షముల నప్రమత్తుఁడై సాధించి సృష్టియొక్క
పరమావధిని జేరవలసిన యుత్తమసంపద గల మానవుఁడు
రాక్షసకృత్యములకుఁ గడంగి యనేక దారుణకృత్యముల నొన
రించుచుఁ దన తోఁటి మానవులకుఁగూడ నపాయము నుపద్ర
వమును దెచ్చుచుండునని యెంచి ప్రజానైతికజీవన ప్రమాణ
మునె ముందుగ నామహాత్ముఁడు సాధింప సమకట్టి శ్రీరా
ముఁడు పదునాలుగేండ్ల యఖండితదీక్షచే సాధించిన రాజ్యము
నిరువదెనిమిదేండ్ల యనంతర మాతఁడు సంపాదింపఁ జాలెను!
ఆనాఁడు వసిష్ఠ, భరద్వాజ, అత్రి, అగస్త్య, శరభంగాది
బ్రాహ్మణు లెట్లు శ్రీరామునికిఁ దోడుపడిరో నేఁడుగూడ ననే
కులు తమజీవితముల నర్పించిన బ్రాహ్మణులు పెక్కండ్రుకలరు.
కొందఱు నవవిమర్శకాగ్రేసరులు రాముఁడు కేవల బ్రాహ్మణ
ప్రియుఁడును బ్రాహ్మణపక్షపాతి యనియు వాదింతురు. అయ్యది
దుర్భ్రమ. "స్వేస్వేకర్మణ్యభిరతః సిద్ధింవిందతి మానవః" యను

ప్రసిద్ధ గీతావచనమును బరమప్రమాణముగ నంగీకరించిన కర్మయోగి రాముఁడు. శ్రీరామచంద్రునకుఁ గేవల జన్మమాత్రమునం దెంతిగౌరవముకలదో తండ్రిని గూడ వీడి జటాయువు మున్నగు పక్షుల కుత్తమగతుల నొసంగుటకై తన తపమును ధారవోసిన నాయాఘట్టములు మనకు బోధింపకమానవు. కావు నని గాంధిజీ నేఁటి ప్రకృతిశాస్త్రవేత్తలగు విద్యాధికులు తాము సాధించిన మారణయంత్రములంగొని రావణాదులవలె రాక్షసులై లోకపీడన మొనరింతు రను భీతిచే నీ దేశమున రామరాజ్యమును స్థాపించి భారతవర్షము నొక యాదర్శప్రాయ మగు ప్రభుత్వస్థానముగఁ జేయఁ దన జీవితము ను ధారవోసెను. అట్టి రాజ్యప్రతిష్ఠకు సంఘీభావమును నిగ్రహమును ముఖ్యము లనుట నిస్సంశయము.

క॥ "కోపంబులేమి సత్యా
లాపము నిజదార పరవి లాసము శుచితా।
గోపన మద్రోహం బవ।
నీపాలక! సర్వవర్ణ నియత గుణంబుల్॥"

యను భీష్మవచనంబులం బాటించి జాగరూకతతో ధర్మవ్యతి రిక్త కామార్థములం బరిత్యజించి యింద్రియనిగ్రహము గలిగి పరమపురుషార్థమగు మోక్షము నందఁ గోరువారి కీ చరాచర భూతవర్గము సహాయ మొనరించుటయకాక నయ్యది వారి యందు నిత్యమును మైత్రింగొని తమజీవిత పరమావధి నట్టి యుత్తమసాధకులు సేరుటకు నాంజనేయునకు మైనాకునివలెను

రామచంద్రునకు సముద్రమువలెను ప్రేమగొని దారియొసంగి తరింపఁజేయునని మనకు రామాయణ మనవరతము బోధించు చున్నది.

నేనీ నాటకమును రచించుటకు నాలుగు ప్రధానోద్దేశములు గలవు. అందు మొదటిది రామాయణమునందలి వాలి వధావృత్తాంతమును సరిగసమన్వయముచేసికొనక శ్రీరాముఁడు వాలి నక్రమముగ వధించెనను లోకప్రవాదమునకు సమాధానము. శ్రీ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారివంటి విద్వాంసుఁడును, రాజ్యతంత్ర విశారదుఁడుగూడ "You may be reminded of a passage in Indian History, where Nuncomar, who forged a document, was punished by death and historians have regarded that it was essentially unjust, as the Indian penalcode does not include forgery among capital crimes. ......I am afraid, in punishing Vali with death Śri Rama was guilty of some such extension" అను భ్రమవిలసితలగు వాక్యములను తమ రామాయణోపన్యాసములందు నుడివిరి! అక్కాలంబున మ్రుచ్చిమి యట్టిదోషములకై బాహువులు ఖండింపబడెడివను విషయము శంఖలిఖితోపాఖ్యానము సాక్ష్యమిచ్చుచున్నది! అట్టితఱి వాలి యొనరించియుండిన దేశద్రోహ, పితృద్రోహ, స్త్రీద్రోహ, భ్రాతృద్రోహాది దుష్కార్యముల కెట్టి దండన కాతఁడర్హుఁడో లోకము గుర్తింపవలెనని నామనవి. శ్రీరాముఁడు సుగ్రీవునితోఁ దనభార్యను దెచ్చుకొనుటకై సహాయమపేక్షించుటచే వాలిని శిక్షించుటలో నా యుదారుఁడు చాల ముందువెనుక లాలోచింపవలసివచ్చెను! సుమారు రెండుమాసములకాల మా

పరమశాంతుఁడు వాలి పశ్చాత్తాపము జెందునేమోయని నిరీక్షించుచుండెను. తుదకు వాలి యెట్టినిష్కృతిని జెందకుండుటచే నాంజనేయు లనినట్లు "రాఘవేణతు వీరేణ భయముత్సృజ్యదూరతః। త్వత్ప్రియార్థం హతో వాలీ శక్రతుల్యపరాక్రమః॥" లోకాపవాద భీతిని త్యజించి మిత్రునికొఱకును ధర్మముకొఱకును రాముఁడు వాలిని శిక్షింపవలసివచ్చెను. నేను నా వాదము నెట్టులనో సమర్థింపవలెనను నభినివేశముతో నా స్వకపోలకల్పితములైన యుక్తి ప్రయుక్తుల నిందుఁ బ్రవేశపెట్టియుండలేదు. పాఠకు లాయాఘట్టములను విమర్శనదృష్టితోఁ దాము రామాయణమును బఠించునప్పుడు గమనింపవలెనని విజ్ఞప్తిసేయుచున్నాను. గోవిందరాజాది వ్యాఖ్యాతలు శ్రీరామచంద్రుని భగవంతునిగ గ్రహించి యాతఁడబద్ధమాడినఁ దప్పులేదని సమన్వయించిరి! కాని నే నీరూపకమునందు రాముని మనుష్యులలో నుత్తమనాయకునిగనె భావించి యాతఁడు ఋజుమార్గమునఁ బ్రవర్తించిన యాదర్శప్రాయమైన రెుక్క ప్రభువనియు, పవిత్రమైన క్షత్రియధర్మమును శ్రుతిస్మృత్యుక్తరీతి నాతఁడు నిర్వర్తించెననియు సూచించితిని. నేనిందు పొందుపఱచిన వాదక్రమ మంతకును శ్రీరామాయణమె మాతృక యని తప్పక చెప్పుచున్నాను.

నా రెండవ యుద్దేశము, రామాయణమున హాస్యరసమెచ్చట వాల్మీకి పుష్కలముగ నిక్షేపించె నను విషయమును లోకమున కందించుట. ది 15-2-1952 తేదీగల హిందూపత్రికయందు "Sudden Glory" అను నుపసంపాదకీయ వ్యాసము

వందు "There are many Occidental Orientalists who tell you that there is no humour in the Ramayanam." అని వ్రాయఁబడిన వాక్యముల నేఁ జదివితిని. నాఁటినుండియు నీ విషయమును నొక చిన్న నాటకరూపమున రామాయణము నందలి తారా లక్ష్మణ సన్నివేశ విష్కంభమునుగొని యందు ప్రతిబింబితమైన చక్కనినీతి యుక్తమగు హాస్యరసమును పాఠక లోకమున కందింప సంకల్పించితిని.

ఒకవైపున సుగ్రీవుఁడు కిష్కింధయందు పట్టాభిషిక్తుఁడై, మంత్రిన్యస్త సమస్త రాజ్యభరుండై నిరాటంకముగ నహర్నిశము దన భార్యలతో క్రీడించుచుండ, తదీయాంతఃపుర కాముక జన కోలాహలములు ఋష్యమూకాద్రియందుండిన శ్రీరామునకు వినఁబడుచుండెను! మఱియొకవంక వర్షకాల మాయుదాత్త మూర్తికిఁ గామోద్దీపనము కలిగించుచుండెను! వేఱొకప్రక్క నాయానగములందలి వనమయూరములు, జలకుక్కుటములు, వనగజంబులు మొదలుగాగల పశు పక్ష్యాదులు తమజంటల నెడబాయకుండ విహరించుచుండెను. అట్టి శృంగారరసభూయిష్ఠమై కాముకజన మనోహరమగు నా భూతప్రకృతినంతయుఁ జూచుచుండిన రామచంద్రునియట్టి నిగ్రహస్వభావముగల వానికిఁగూడ మన్మథోద్రేకము కలిగి:-

శ్లో॥ "ఇమా స్ఫీత గుణావర్షా స్సుగ్రీవస్సుఖమశ్నుతే॥
విజితారిస్సదారశ్చ రాజ్యేమహతి స్థితః॥"
"అహంతు హృతదారశ్చ రాజ్యాచ్చ మహతశ్చ్యుతః।
నదీకూల మివక్లిన్నమవసీదామి లక్ష్మణ! ॥"

యని వలపించుటఁజూడ "ధ్యాయతో విషయాన్పుంసస్సంగ స్తేషూపజాయతే" యను గీతావాక్యమునందెట్టి ప్రబల ప్రమాణముగలదో మనము గ్రహింపఁగలము! అట్టిమన్మథావేశమె "కామాత్సంజాయతె క్రోధః" యనునట్లు సుగ్రీవాలస్యము వలన రామునికిఁ గోపము జనింపఁజేసి యా పరమశాంతుని గూడ "నచసంకుచితః పంథా" "ఏక ఏవ హతోవాలీ" త్యాది తీక్ష్ణవచనములను నట్లొనరించినది!

ఇఁక నా విచిత్రసంఘటనమునందు రామచంద్రుని తీవ్ర విరహతాపమును, సుగ్రీవుని యతిలోలతచే నాతనికిఁ గలిగిన చీకాకును గ్రహించి కవి యా సందర్భమున రాముని విప్రలంభము నుచితత్వమును గూడ మించినంత యుద్రేకావస్థకుఁదెచ్చి తుదకు మెల్లగ నా రామచంద్రుని రౌద్రమును వీరరసమునకు దింపి హాస్యరసములోనికిఁ దెచ్చెను. ఆ కవిబ్రహ్మ ఘంటము బాలకాండములోని రాముని విష్ణ్వవతార స్వరూపమునుండి యిప్పుడొక విప్రలబ్ధుఁడగు సామాన్య నాయకునిగ మార్చివేసెను! ఈగతి పరిణామమునకు శ్రీరాముని మనుష్యత్వ సౌధ శంకుస్థాపనము నయోధ్యాకాండమునఁ బట్టాభిషేక విచ్ఛేదావసరమునఁ బ్రారంభించి యరణ్యకాండమునం దా సౌధమును విస్తరింపఁజేసి కిష్కింధాకాండములో నద్దానికి శిఖరప్రతిష్ట గావించెను! అవతారమునకుఁ బూర్వము రాముని శ్రీమహా విష్ణువుగ జెప్పి యాతడు దశరథనందనుఁడై లోకమునం దవతరించినపిమ్మట నా రామచంద్రుని మానవత్వమెట్లు వాల్మీకి క్రమక్రమముగ నిర్వర్తించెనో తెల్పుటకు గ్రంథవిస్తర భీతిచే వదలు

చున్నాను. కిష్కింధాకాండమును బ్రారంభించుటకుఁ బూర్వము "దశాభాగగతో హీన స్త్వంహిరామ! సలక్ష్మణః। యత్కృతే వ్యసనం ప్రాప్తం త్వయా దారప్రధర్షణం॥" అను కబంధవాక్య ములతోఁ గవి యరణ్యకాండమును బూర్తిగావించెను! అటు పిమ్మట కిష్కింధాకాండ ప్రారంభమున పంపాసరోవరమున నా పురుషపుంగవుని తీవ్ర మన్మథవికారముతోఁ బ్రారంభించి గంభీరములగు "హృదయహారక" హనుమద్వాక్యములచే నా కామసంతప్తుని హృదయమునందు సీతా పునఃప్రాప్తి సూచనలు రేకెత్త నయ్యది "నీళ్ళకు స్వల్పనై" యా యపూర్వదూతచేతఁ గవి జిక్కించెను! అట్లు మారుతి వశమైన రాముఁడు మలయ మారుతవశమైన కాముకునివలె యవిచారితముగ సుగ్రీవునితో నగ్నిసాక్షికమగు మైత్రిఁ గొనెను! అటుతరువాత వాలి వధానం తరము సుగ్రీవుఁడు సురాపాననిమగ్నుఁడై స్త్రీలోలతచేఁ దన్ను వంచింప నందువలనఁ గలిగిన విషాదమును, తన నిస్సహాయస్థితికి జుగుప్సయు సీతా పునఃప్రాప్తికి నాతురతయు, మున్నగు వివిధ విరోధగసభావములు పుంఖాను పుంఖములుగ బయలువెడలి రాముని మానసము నెట్లాందోళితము సేసెనో వర్ణించుటలో వాల్మీకి కవితానైపుణ్యమునంతయుఁ జూపుటయె కాక తీవ్రవిషా దావిర్భావ ఘట్టములందు కలిగెడి మనుష్య మనస్తత్వమును వ్యక్తముసేయుటయందా కవిబ్రహ్మ నిర్మాణకౌశల మంబర చుంబి యయ్యెను. ఒకవంక నిస్పృహ, వేఱొకవంక సంశయము మఱొకవైపున సంతాపము ఇంకొకదిక్కున నావేశము, తుదకు క్రోధము, వీని నన్నిటిని మించిన తనసహజ స్వభావమగు కరుణ,

ఇట్టి పరస్పరవిరుద్ధములగు మనోభావములు శ్రీరాముని మానసవీధిని జనింపఁజేసి "మానుషీం తనుమాస్థాయ రావణం జహీసం యుగే" యని దేవతలు తమ ప్రభువగు విష్ణుదేవున కిచ్చిన సవాలునం దాయవతారమూర్తి గూడ మనుష్యదేహము నందుఁ బ్రవేశించినప్పు డేరీతిని "సదృశంచేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి। ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి?" యను భగవద్వాక్యమున కా మహామహుఁడుగూడ నెట్లు జోహారు లర్పింపవలసివచ్చెనో యా మహాకవి మనకు సుబోధముగ జెప్పియున్నాఁడు! ఇంతకన్న శ్రీరాముని మనుష్యత్వ ప్రతిష్ఠకు ప్రబలతరప్రమాణ మేమి కావలయును?

ఇఁక కిష్కింధాకాండములో రాముని కేవల విప్రలంభ శృంగారనాయకునిగ వర్ణించి క్రమక్రమముగ నొక హాస్యరస ప్రధానమగు సన్నివేశమున కెట్లు పాఠకులహృదయముల నాకర్షించెనో కొంచెము విమర్శింతము. సుగ్రీవుఁడు సహజముగఁ గొంత పిరికిస్వభావముగలవాఁడు! మిక్కిలి భోగాసక్తుఁడు! మూర్తీభవించిన వానరపుంగవుఁడు! "కొబ్బరికాయ దొరకిన క్రోఁతి" యనవచ్చును. లక్ష్మణుఁ డహంకారమునకు మూర్తి! ఆతనియందు క్షత్రియత్వ మెప్పుడు నుత్తమస్థాయిని తాండవించుచుండును! రజోగుణమునకుఁ బుట్టినిల్లు! తార యుక్తిగ మాటలాడుటయందు జాణ! భక్తి జ్ఞాన వైరాగ్యములం దాఱితేఱిన చిత్రిణి! శ్రీరామచంద్రుఁ డొక యవతారపురుషుఁ డని పూర్తిగ నెఱింగిన రామాయణ స్త్రీల నలువురిలో నామె యొకతె! "కీర్తి శ్రీర్వాక్చ నారీణాం" మను గీతావాక్యమున

కామెను లక్ష్యముగఁ జూపినఁ దప్పులేదు ! అటువిమ్మ టాంజ
నేయు లోకవంక రామకార్య ధురంధరుఁడు శ్రీరామ లక్ష్మ
ణులను పంపాసరోవరమువద్దనుండి ఋష్యమూకమునకుఁ దన
నెత్తిన మోచుకొనివచ్చినప్పుడె రామకార్యము నాచతుర్వేద
పారంగతుఁడు సాధించుటకుఁ బూనుకొనెనని మనకు ద్యోత
కము కాకమానదు ! ఆ క్రొత్తగవచ్చిన యువకులెవ్వరో
చూచిరమ్మని సుగ్రీవుఁడు తన్నంప దూరమునుండియె తన
ప్రభువగు సుగ్రీవుఁ డానూతనవ్యక్తులు తనవారె యనుకొని
నిశ్చింతగ నుండగలఁడని యూహించి వారిని నెత్తినెక్కించు
కొనిన యపూర్వదూత ! శ్రీరాముని కార్యమును సాధింపవ
లెను, సుగ్రీవుఁడు క్షేమముగనుండవలె నను స్వపరకార్య
సాధనసమర్థుఁ డాంజనేయుఁడనుట స్పష్టము. అంగదుడన్ననో
యెట్టులైనఁ దన పినతండ్రి దోషియని లోకమునకుఁ జాట
కుతూహలముగల వానరక్షత్రియుఁడు ! తనతండ్రియగు వాలి
యుపదేశమును పూర్తిగ గ్రహించి యద్దాని నామూలాగ్రముగ
నిర్వర్తింపఁబూనిన నయశాలియె గానిచో నాతఁడుగూడ Shakes-
peare మహాకవి "Prince of Denmark" వలె విషాదాంత
జీవితమునకు గురికావలసినవాఁడె. "దేశకాలౌ భజస్వాద్యక్షమ
మాణః ప్రియాప్రియే। సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ!॥
"భర్తురర్థపరో దాంతః సుగ్రీవవశగో భవ !" యను పితృవాక్య
ములను జాగరూకతతోఁ బాటించిన సూక్ష్మ రాజ్యతంత్రవిశా
రదుఁ డంగదుఁడు ! ఇట్టి యపూర్వపాత్ర సంఘటనముచే నా
కవితల్లజుఁ డొక "Comedy of Errors"వంటి లలితహాస్యకళా

నైపుణ్య ప్రదర్శితమైన యొక విచిత్రనాటకమాడించి కావ్యాది యందుఁ జేయఁబడిన "రసై శృంగారకారుణ్య హాస్య వీర భయానకైః। రౌద్రాదిభిస్సంయుక్త" మ్మను తన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనెను !

లక్ష్మణుఁడు యథార్థముగ తీవ్రకోపనుఁడై కిష్కింధలోఁ బ్రవేశించియుండెనేని, దశరథాత్ములనె చంపుదునని శత్రిదూసిన సాహసికుఁడు,సుగ్రీవుని మన్నించునా?"క్రుద్ధోహన్యాద్గురూనపి" యను నార్యోక్తి ననుసరించి యా సహజచండకోపనుఁ డెంతటి తీవ్రతనైన నా కపిరాజుపైఁ జూపియుండును. అట్లు సేయక "మదవిహ్వలయై" "ప్రస్ఖలద్గమన" ముతో "ప్రలంబ కాంచీగుణ హేమసూత్ర"యై వచ్చి "సఖేల"ముగఁ దనతోఁ మాటలాడు నా తారాదేవితో లక్ష్మణుఁడు సంభాషించుటకు సమాధాన మామెకొసంగుటకు నెట్లియ్యకొనును ? పైఁగ నామెను జూచిన తోడనె "స్త్రీ సన్నికర్ష"ముచే "వినివృత్తకోపు"ఁడై తలవంచు కొనునా ? ఈఘట్టమునఁ గవి తారనిట్లు వర్ణించుచు నామెన్ను రంగస్థలమునకుఁ దెచ్చుటలోఁ దన నాట్యకళావైదుష్యము నంతయుఁ జూపియున్నాఁడు !

శ్లో॥ "సాప్రస్ఖలంతీ మదవిహ్వలాక్షీ।
ప్రలంబ కాంచీగుణ హేమసూత్రా।
సలక్షణా లక్ష్మణ సన్నిధానం।
జగామ తారా నమితాంగయష్టిః॥"

అట్టి తార నంతఃపురమున సుగ్రీవ పర్యంకమునుండి హఠాత్తుగ తీవ్రకోపనుఁడగు లక్ష్మణు నెదుటకుఁ దెచ్చుటలోఁ గవి యభి

ప్రాయమేమి? "అయ్యో! పాపము నా బొబ్బరింతలకు భీతిల్లి సుగ్రీవుఁడు తనప్రియభార్యను శయ్యనుండియె తిన్నగ నంపించె" ననియు సుగ్రీవుఁ డమాయకుఁడనియు తమయం దాదరభావము వీడ లేదనియు నట్లువచ్చిన తననుజూచి యాచండకోపుఁడగు లక్ష్మణుఁడును కంప వహింపజాలకుండ నుండఁడని మొదలగు తార యుక్తినంతయు కవి లోకమునకుఁ జూపెను! కార్య భంగభీతిచేతను నగ్నిసాక్షికముగఁ గరస్పర్శచేసిన మిత్రుని జం పుట పాడికాదనియు నెంచి రామచంద్రుఁడు సోదరుని బంపు నప్పుడు దనకోపము నుపసంహరించుకొని "సామోపహితయా వాచా రూక్షాణి పరివర్జయన్। వక్తుమర్హసి సుగ్రీవం వ్యతీతం కాలపర్యయె॥" యని చెప్పి యంపెను. ఇఁక లక్ష్మణుఁడుగూడ నెటుల కిష్కింధ ప్రవేశించెనో కవియె యిట్లు వర్ణించెను. "తతశ్శుభమతిః ప్రాజ్ఞో భ్రాతుః ప్రియహితేరతః। లక్ష్మణః ప్రతి సంరబ్ధో జగామభవనం కపేః॥" యనుటంబట్టి యా లక్ష్మణుని "భ్రాతుః ప్రియస్య సుగ్రీవస్య హితేరతః" యని మన మర్థము జేసికొనినచోఁ దప్పులేదు. అందుచే నాతని సంరంభమంతయు కేవల "ప్రతిసంరంభ" మాత్రమె కాని నిజమగు కోపము కాద నుట స్పష్టము. ఇచ్చట "ప్రతి" యను నుపసర్గకు సదృశార్థము తగియున్నది. "ప్రతిప్రతినిధౌ వీప్సా లక్షణాదౌ ప్రయోగతః" యని యమరము. కావున లక్ష్మణుని కోపమంతయు నటనా సం రంభ మనుట నిర్వివాదము.

ఆంజనేయునిఁ దిలకించినచో నాతఁడు రామకార్యము నం దప్రమత్తుఁడై స్వామి క్షేమభంగము వాటిల్లకుండ నెట్టి

లనో యుక్తియుక్తముగ దన ప్రభువును దుర్వ్యసనములనుండి తప్పించి శ్రీరాముని కార్యమున కభిముఖునిగఁ జేయఁబూనిన ప్రతిభాశాలి యనుట నిస్సంశయము. సుగ్రీవు నొకవంక రామ కార్య సాధనకుఁ బూనుకొనునట్లు మాటిమాటికిని ప్రబోధించుచు లక్ష్మణుఁడు కోపోద్రిక్తుఁడై వచ్చెనని యా కపిరాజు భయమందుచుండ "సర్వథా ప్రణయాత్క్రుద్ధో రాఘవో నాఽత్ర సంశయః" యని మఱియొకమూల నాతని భయాపనయ మొనరించుటయు, నిఁక నొకవైపున "త్వంప్రమత్తో హి నజానీషే కాలం కాలవిదాంవర!" యని నిందాస్తవరూప ప్రగల్భవాక్యములచే మందలించుటయుఁ జూడ నొకవేళ నాంజనేయుఁడే లక్ష్మణుని నారీతిఁ గోపమొందఁజేసి కిష్కింధకుఁ దెచ్చెనేమొ యని యనుకొనుట కవకాశము గల్పించెననవచ్చును! అందుచే తన "అసుహృద్భిర్మమా ఽమిత్రై ర్నిత్యమంతర దర్శిభిః। మమదోషాన సంభూతా౯ శ్రావితో రాఘవానుజః" యని తన పానమత్తతచేఁ గలిగిన మతివిభ్రమము సుఖభోగముల వీడుటకు మనసోపమియు, నంగదవాక్యములచేఁ గలిగిన భయోద్రేకము, దన సహజ భీరుత్వముచే సంభవించిన పిఱికిదనము నిట్లన్ని యుద్రేకభావములు దనమనంబున ముప్పిరిగొన నుక్కిరిబిక్కిరియై గ్రుక్క ద్రిప్పుకొనఁజాలక తుదకు సుగ్రీవుఁడు దనకుఁ బరమహితాపాదకుఁడగు నాంజనేయునిగూడ సంశయించునంతటి దురవస్థకు దిగెను! ఇట్లొక్క భోగలాలసత్వమను దౌర్బల్యము స్వపరభేదముల నెట్లు జీవులు గుర్తింపకుండఁ జేయఁ గలదో నిరూపించుచు నా కవిపుంగవుఁడు విరుద్ధస్వభావములూ

గల యిరువురు పురుషుల స్నేహము నపేక్షించి యిరువుర క్షేమము గోరువారె ట్లనవసరముగ ననుమానములకు లోనగు దురో చూపి పాఠకులను హెచ్చరించియున్నాఁడు! ఇరువురు భిన్నాభినివేశములు గల యట్టిగాని, విభిన్నాదర్శములు గల విజాతీయ దృక్పథవర్తులకుఁ గాని మధ్యవర్తులై యుండి యా యిరువురకుఁగూడ నిష్టాపత్తి నొనరింపఁ దలంచినవార లాంజనే యునివలె మిగులనోర్పుకలిగి కడుసమర్థతతోడను నవ్యాజాంతః కరణముతోడను నిష్కామకర్మాచరణ దీక్షితులై యుండినం గాని యనేకానర్థములపాల నట్టివారు వడవలసియుండునని మనకీ ఘట్టమున నాంజనేయపాత్ర బోధించుచున్నది.

ఏదేని రసాస్వాదనమునం దది యథార్థమగు రసముగాక యొక యాభాసితమనిగాని కృత్రిమమనిగాని మనకుఁదెలిసినచో నది మనకాశ్చర్యమును బుట్టించి యట్టి రసాభినయముచే హాస్య ముత్పన్న మగుచుండును. "వాగంగాది వికారదర్శన జన్మా వికాసాఖ్యోహాసః" యని పండితరాయలు తన రసగంగా ధరమునందుఁ జెప్పియున్నాఁడు. కృష్ణుఁడు దధి భాండవిక లనాదు లొనరించినప్పుడు యశోదచూపిన కోపనటనా సంరంభ మంతయుఁ జూపఱులగు గోపికలకు హాసమును బురికొల్పనే కాని వారియందెట్టి భయానుభవమును బొడసూపలేదు! అట్లనే తన రౌద్రరస నటనాకౌశలమునంతయుఁ జూపి తుదకు లక్ష్మణుఁడు తారాయుక్తిచేతను, తన కార్యసాధనావశ్యకతను బట్టియు నట్లంతఃపురమునుజొచ్చి సుగ్రీవుని తాన స్వయముగ సందర్శించెనని కవి మనకుఁ జెప్పియున్నాఁడు:-

శ్లో॥ "తదాగచ్ఛ మహాబాహో! చారిత్రం రక్షితం త్వయా!
అచ్ఛలం మిత్రభావేన సతాం దారావలోకనమ్॥"
"తారయాచాభ్యనుజ్ఞాత స్త్వరయాచాపి చోదితః।
ప్రవివేశ మహాబాహు రభ్యన్తరమరిన్దమః॥"

పైశ్లోకములంబట్టి లక్ష్మణకోపమంతయు నభినయితమనుట నిస్సందేహముకదా! అటుల నా సౌమిత్రి సుగ్రీవాభ్యంతర మునుజొచ్చి ప్రమదామధ్యగతుఁడైన యా కపిరాజునుగాంచి "సంరబ్ధతర రక్తాక్షుఁడై" "యంతకసన్నిభుఁ"డగుటయు నప్పుడు పిఱికియగు నాపింగేశుఁడు నిర్వ్యాజపాటుతో లక్ష్మణునిఁజూచి భీతిల్లి రుమను గాఢముగ కౌఁగిలించుకొనుటయు మొదలగు చమత్కారసంఘటనముల నిట్లు వర్ణించి యా కవికులతిలకుఁడు సుగ్రీవ లక్ష్మణుల "వాగంగాది వికృతు"లను మానసికోద్రేకములను మనకన్నులకు నేఁటికిని గట్టియున్నాఁడు!

శ్లో॥ రుమాంతు వీరః పరిరభ్యగాఢం।
వరాసనస్థో వరహేమవర్ణః।
దదర్శసౌమిత్రి మదీనసత్త్వం।
విశాల నేత్రః స్సువిశాలనేత్రం॥

పైశ్లోకమునఁ గుపితలక్ష్మణుని విశాలనేత్రములును, నాఁడుదానిని కౌఁగిలించుకొనిన "వీరు"ఁడగు సుగ్రీవుని "సుభటత్వ"మును కవియుగ్గడించినతఱి మనమా దృశ్యమును యథార్థముగజూచి యుండితిమేని యా తారాదేవికివలె మనకుఁగూడ నా ఘట్టము

నందలి హాస్యరస మెంత యుద్రేకస్థితికివచ్చెనో బోధపడియుం డెడిది ! రంగస్థలమున నాసన్నివేశమును నేఁటి నటకులు ప్రదర్శించునప్పుడు వారి నటనాకౌశలముపై యందలి హాస్యరసస్ఫూర్తి పూర్తిగనాధారపడియుండునుగదా !

నా మూఁడవయాశయము మద్యపాననిషేధమును వాల్మీకి యెట్లు నిరూపించెనో చెప్పుట. మదిరాపానముచే సుగ్రీవునియట్టి నయకోవిదుఁడుగూడ కామపరతంత్రుఁడై తప్పుత్రోవలం బడి యదృష్టవశమున సంపూర్ణస్వామిభక్తియుతుఁడగు నాంజనేయునియట్టి మంత్రిసత్తముఁడును, భర్తృహితైషిణియైన తారయుఁ దనకులేకుండినచో రామచంద్రునిబోలు పరమధర్మమూర్తి మైత్రిఁ గోలుపోవుటయుకాక, వాలివలె నతఁడుగూడ శిక్షకుఁ బాత్రుఁడు గావలసివచ్చెను ! రామాయణమునందలి సుందరకాండములోని మధువనభంగ వృత్తాంతముగూడ పానము దోషమని మనకు బోధించును గాని దానియందలి పరమార్థము వేఱుగనున్నందున నచ్చటి విషయమింత ప్రమాదముగ బరిణమింపలేదు !

ఇఁక నా నాల్గవ లక్ష్యము, రామాయణ మహాకావ్యము నం దిట్టి చక్కని రసానుభూతిని కలిగించుచు ధర్మమునుబోధించునట్టి ఘట్టములు లెక్కకు మిక్కిలి యున్నవి. ఆయా సన్నివేశములందు వాల్మీకిమహర్షి మానవస్వభావము లెట్లు పరిపాకము నొందుచుండునో, యనేక క్లిష్టసమస్యలు మన దైనందిన జీవితమునందును, రాజకీయ రణరంగములందుఁగూడ నయ్యావి

మనల నెట్లు చీకాకుపఱచుచుండునో వాన్నిన్నిటి నొక్క ధర్మ
ప్రతిష్ఠచే మానవుఁ డెటుల నెదుర్కొని యట్టి ఘోరవిపత్పరం
పరలనుండి తరించునో చిత్రముగ జిత్రించియుండెను. కావున
శ్రీమద్రామాయణమును మనయువతీయువకులు చక్కని
విమర్శనదృష్టితో నిత్యమును బఠించుచుండిన నట్టివారికది భావ
శబలత బుద్ధిపాటవము, హృదయవికాసము నొసంగి యాత్మో
న్నతినేకాక దేశాభ్యుదయమును సంఘౌన్నత్యమును సాధించు
శక్తిని వారికొడఁగూర్చునని సూచించుట కీనాటికను శాఖా
చంద్రన్యాయముగ లోకమున కర్పించుచుంటిని. సహృదయు
లిందలి దోసఁగులు మన్నింతురుగాక! ఈనాటిక నచ్చువేయిం
చుటకు నాకు ద్రవ్యసహాయ మొనరించి నన్ను ప్రోత్సహించిన
శ్రీ భమిడిపాటి సత్యనారాయణకును నాతని ధర్మపత్నియగు
శ్రీమతి భవానమ్మకు నా శుభాశీస్సు లొసంగుచున్నాను.
నా యీ చిన్నకృతికి తమ యమూల్యమగు తొలిపలుకు వ్రాసి
నా కుత్సాహము గొల్పిన శ్రీ చతుర్వేదుల సత్యనారాయణ
శాస్త్రి ఎమ్. ఏ. బి. ఒ. ఎల్. గారికి కృతజ్ఞతాపూర్వక వంద
నము లర్పించుచున్నాను.

కాకినాడ, రామారావుపేట

ఇట్లు బుధవిధేయుఁడు,
భమిడి సత్యనారాయణశర్మ.

శ్రీరస్తు

అవిఘ్నమస్తు.

# చిత్రతారకము

## ప్రథమాంకము

---

### నాంది - ప్రస్తావనము.

శ్రీ మాతృప్రతిభా సముద్భవగుణో
ర్మిస్ఫార లీలాకృత
వ్యోమాద్యష్ట మహావిభూతులె తను
వ్యూహంబుగా ఋగ్యజు
స్సామాథర్వణ వేదనాదమె ధను
ష్టంకారమై యొప్పు శ్రీ
రామాఖ్యంబగు చిత్రతారక పర
బ్రహ్మంబు మిమ్మోముతన్!॥

### నాంద్యనంతరము

సూత్రధారుఁడు:- నటీ! ఇటురమ్ము!

నటి:- (తెరలోనుండియే)ఇదె వచ్చుచున్నాను(కొంచెమాలసించును)

సూత్ర:-(విసుగుకొనుచు) అబ్బా! ఈ యాఁడువారితో నెప్పుడు నింతె! ఆలస్యము చేయుట వారికి స్వభావము! దానిని గప్పిపుచ్చుట కెద్దియో సాకుపన్నెదరు.

నటి:- (ప్రవేశించి) ఔను! మగవారు తమ పనులన్నియుఁ జక్కఁ బఱచుటకు మమ్ముపయోగించు కొనవచ్చును! కాని మే మొక్క క్షణ మాలసించినచో వారు సహింపఁ జాలరు!

సూత్ర:-అదిగో! నేనన్నటులె చెప్పితివి! అరణ్యవాసమునకుఁ బోవుటకు పయనమైన శ్రీరామచంద్రుని వెంటనరుగు టకు సీత యొక్కనిముసము గూడ నాలసింపలేదఁట! నీయట్టివట్టి నటకుల కేల నీ యాలస్యము!

నటి:- మీరిప్పు డరణ్యవాసమునకుఁ బోవుచుఁటిరా? అట్లైన నేనును సిద్ధముగ నున్నాను. రండుపోవుదము!(వాలుఁగడు గులు ముందుకువైచును).

సూత్ర:-బాగుగ నున్నది! అందఱు రాములైనచో వారుపోవుట కిప్పు డరణ్యము లేవి?

నటి:- (నవ్వుచు) మఱి యీపాటిసాపాటు రాములకు తొందర లెందులకో!

సూత్ర:-(చిఱునగవుతో) అబ్బెబ్బే! అందులకుగాదు నటీ! నీవు త్వరగవచ్చి నీ మృదుమధుర నృత్యగీతములచే నీ సభా సదుల రంజింపఁజేయుదువని యట్లంటిని!

నటి:- అట్టి చక్కని శృంగారరస విన్యాసమును మీరు తలపెట్టి నప్పుడు నే నలంకరించుకొనకుండ నెట్లువత్తును? మీరిట్టి నాటకప్రదర్శనములచే సంపాదించిన ద్రవ్యముతో నాకుఁ జేయించిన నేడువారముల నగ లూరక వ్యర్థముగావా?

సూత్ర:-ఓహో! స్త్రీలముందు పురుషులు మాటలాడుట కష్టము! యుక్తిప్రయుక్తి ప్రసంగమున తారాదేవితో వేగఁజాలక లక్ష్మణునివంటి ప్రతిభావంతుఁడె ముగ్ధుఁ డైనాఁడు!

నటి:- అదేమిటండోయి! ఏదియొ క్రొత్తవిషయము నెత్తు చున్నారే!

సూత్ర:-ఇందుఁ గ్రొత్తయేమున్నది? శ్రీరామునకు సాయమొన రింప సుగ్రీవుఁ డాలసించెనని యలుకబూని కిష్కింధ ప్రవేశించిన లక్ష్మణుని తారాదేవి యెట్లు విచిత్రముగ శాంతింపఁజేసెనో వాల్మీకిమహర్షి యత్యంత మనోహర ముగ జిత్రించెను. ఆవిచిత్రసంఘటనమునే మనమిప్పుడు "చిత్రతారక" మను నాటకమునఁ బ్రదర్శింపఁబోవు చుంటిమికాదా?

నటి:-అందుకొఱకేకాఁబోలు నన్ను మీరు త్వరగరమ్మని పిలచి తిరి! నాకిప్పు డర్థమైనది!

సూత్ర:-నీకిప్పు డేమి తెలిసెనో కొంచెము చెప్పుము చూచెదను!

నటి:-వీర హాస్య రసప్రధానములైన యిట్టినాటకములఁజూచుట కీ రసికులును (సభనుజూపును) ప్రదర్శించుటకు మన

సామాజికులును సహజముగ నువ్విళ్లూరుచుందురు. వీరరసాభినయమున లక్ష్మణుఁ డందె వేసినచేయి. యుక్తిగ మాటలాడుటలో తార మిన్న. ఈ యిరువుర సన్నివేశమును వాల్మీకివంటి రసికావతంసుఁడు వర్ణింప నేరికిఁ గ్రొత్తక్రొత్తభావము లుప్పతిల్లవు?

సూత్ర:-ఔను! స్త్రీలు జన్మచేతనె యశిక్షిత పటుత్వముగలవారు అందును నీవు తారవలె చాలఁజదివిన జాణవగుటచే చక్కఁగ గ్రహించితివి! కాని నీవొక్కటి చెప్పక దాఁచితివి!

నటి:-పోనిండు. అదేదియొ మీరు ప్రకటింపకూడదా?

సూత్ర:-ఈనాటకమునందు మీస్త్రీల కెక్కుడు ప్రాముఖ్యమును కవి యొసంగుటచే కాఁబోలు నా విషయము నాచేతఁ జెప్పించుచుంటివి! కానిమ్ము! నటీ! మఱి పాత్రము లన్నియు సిద్ధము సేసితివా?

నటి:-ఏమి చోద్యమండీ! ఇప్పుడె కదా మీరు నాటకస్వరూపమును వెల్లడించిరి! ఇంతలోనె పాత్రము లెట్లుసిద్ధమగును? పైఁగ కొందఱునరులు మఱికొందఱువానరులు!

సూత్ర:-(నవ్వుచు) వారమురోజులనుండి పెద్దపెద్ద వాయుదీపములతో నూరంతయుఁ బెండ్లివారివలె "నేఁడు చిత్రతారక నాటకమండో!" యని మన మూరేగించుచుంటిమిక దా! మన నాటకమునుగూర్చి నేనిప్పుడు సెప్పఁగ నీవు వింటి వనుట నన్ను పరిహాసించుటకుఁ గావలెను!

నటి:- ఔను! మే మేమి సెప్పిన నది పరిహాసముగ నుండును! ఏమి సేయుదుము! మాయస్వాధీన జీవన మెప్పుడునింతే! మగవారు తలంచినంతమాత్రమున మేమూహించుకొని యన్నియు సిద్ధము సేయవలెను!

సూత్ర:- పురుషుల హృదయములను గ్రహించుటలో స్త్రీల కసమాన పాండిత్యముకలదు! ఇఁక గ్రంథము పెంచక నొక్కసారి నీమధుర గానామృతముచే నీశరదృతువును గూర్చి పాడుము! నటీ!

నటి:- కానిండు మీయభీష్టము నెఱవేర్పకున్న లక్ష్మణునివలె మీరుగూడ నలుగుదు రేమో !

ఉ॥ అంకము స్పష్టమయ్యెను శ
శాంకుని బింకము పొంక మొంద; ని
శ్శంకత నబ్బెనెల్లరకుఁ
జక్కనిజీవన మంతకంతకున్
పంకములింకె పృథ్వి; నిదె
పచ్చని పచ్చిక మేయ ధేనువుల్
అంకెలఁగొంచుఁ బాఱె నను
రాగముమీఱఁగ షట్పదంబులున్
ఝుంకృతులొప్పఁ దామరల
సొంపున కుబ్బుచు రేఁగె నల్లదే!
(చెవియొగ్గి) సంకులమయ్యె వానరుల
సందడి శారదజైత్రయాత్రకున్ !!

సూత్ర:-ఔరా! నటీ! పాత్రలన్నియు నీవఱకె సిద్ధముసేసి మఱి లేదంటివే! స్త్రీలను నమ్ముట కెంతమాత్రము వీలు లేదు!

నటి:- పురుషులెంతటి సత్యవాదులో నా తారారుమల మధ్య నిఱికికొన్న సుగ్రీవునిఁ జూచి యీసభ్యులె నిర్ణయింపఁ గలరు. అదుగో! కపిరాజు దన యిరువురు రాణులతో హంసతూలికాలంకృతడోలికల నూఁగుచుఁ బ్రవేశించుచున్నాఁడు! రండు పోవుదము!

సూత్ర:-అట్లయిన నిఁక ద్వరగఁబోవుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ప్రస్తావనము సమాప్తము.



# చిత్రతారకము

## ప్రథమాంకము.

---

### ఒకటవ రంగము.

రసము:-శృంగారము. పాత్రలు:-సుగ్రీవుఁడు తార రుమ అజ ముఖి, ఆంజనేయులు.

రంగము:-(కిష్కింధాపట్టణము సుగ్రీవమహారాజు నంతఃపురము తారారుమా దేవులతో సుగ్రీవుఁడు ప్రవేశించును. సుగ్రీవుఁడు తారాదేవితో నుయ్యెలయందుఁ గూర్చుండ రుమ పై యంచునఁగూర్చుండి ఢోలిక నూఁపుచు నీక్రింది రీతిని పాడుచుండును.)

రుమ:- శా॥ శ్రీకాంతామణి సీతగా శయనమా
శేషాహిసౌమిత్రిగా
కైకేయీ తనుజుండు శంఖమదె చ
క్రంబెన్న శత్రుఘ్నుఁడై
వైకుంఠంబు నయోధ్యగాభువి ముని
వ్రాతంబు రక్షింపఁగా
శ్రీకౌసల్యకుఁ బుత్రుఁడై తనరెనా
క్షీరాబ్ధి సంవాసియే !

సుగ్రీ:-(పానమత్తతచే తలనూఁపుచు) ఆహా! రుమా! నీ...గాన... మాధుర్యమతి మనోహరముగనున్నది! రామచంద్రునిఁ

గూర్చి చక్కగ వర్ణించితివి ! (అని రమచెక్కిలి ముద్దుగొనం బోవ నామె చిఱునవ్వుతోఁ దలత్రిప్పుకొని యపవారణ మొన రించును.)

(అంత నజముఖియను దాసి ప్రవేశించి తారయొద్దకుఁబోయి మెల్లగ)

అజముఖి:-తారాదేవి ! సుగ్రీవమహారాజు కొఱకాంజనేయ సచివుఁడు ద్వారము నొద్ద నిలిచి యున్నాఁడు. ప్రభువుతో నద్దియొ మిగుల నావశ్యకమైన కార్యము గలదని వారితో మనవి సేయుమనెను.

తార:-రాజా! ఆంజనేయ సచివుఁడు మీకొఱకై ద్వారము నొద్ద వేచియున్నట్లు పరిచారిక చెప్పుచున్నది. అతఁ డెద్దియొ మహాత్కార్యము లేక యూరకరాఁడు. ఆతని నిటకు రప్పించుటకన్న మీరెపోయి యాతనితో ముచ్చటించుట యుక్తము.

సుగ్రీ:-(పానమత్తతతో)అబ్బ! నేనిప్పు డిచ్చటనుండి కదలఁజాలను తారా ! ఆతని నిచ్చటకు రమ్మని జెప్పుమనుము.

తార:-అజముఖీ! నీవు సత్వరముగఁబోయి యాంజనేయునిటకుఁ దోడ్కొని రమ్ము.

(అంత తారాదేవి చేసన్న చే డోలికనాప తారారుమలు తెరచాటునకుఁ బోవుదురు.)

(అజముఖి నిష్క్రమించి యాంజనేయులతో మరల బ్రవేశించును.)

ఆంజ:-జయము! జయము! మహారాజా! (అని సుగ్రీవునకు నమస్క రించి నిలువఁబడును, అజముఖి వెడలిపోవును.)

సుగ్రీ:-ఆంజనేయా! ఏలనింత తొందరతో వచ్చితివి?

ఆంజ:- ప్రభూ ! మీరు శ్రీరామకార్యమును జక్కబెట్టుటకై రామచంద్రుని కొసంగిన వాగ్దానమును జెల్లించు కాల మాసన్నమైనది!

సుగ్రీ:-(దగ్గఱనున్న పానపాత్రములోని మద్యమును ద్రావుచు) ఏమీ!... రామ...కార్యమా?...నావాగ్దానమా !...ఔను... ఆంజనేయా! కొంచెము జ్ఞాపక మొచ్చుచున్నది!ఔను... ...మిత్రమా !...ఆనాఁడేద్దియొ...సీతను... వెదకుద మని...అంటిని !...కాదూ !

ఆంజ:-రాజా ! శ్రీరామచంద్రుని కార్యమును, నీపవిత్రవాగ్దానమును మఱచుట పాడికాదు.

ఉ॥ వేలయెఱింగి ధర్మమును
వీడక యెందును నర్థకాములన్
పీలుగఁ గోరులువారెపుడు
వ్రీడఁదలంకక శ్రీయునాయువున్
చాలగఁ గల్గి లోకమున
శాశ్వతకీర్తి గడించి దివ్విలో
కాలిని గొందు రంత్యమున
నందును నిందు సుఖంబు జెందుచున్॥

సుగ్రీ:-(వికటముగ నవ్వుచు)రాముఁడు...మాత్రము...తనభార్యా వియోగముచే...నిరంతరము...పరితపించుటలేదా?... మిత్రమా! కాముని...బాణములకు...రాముఁ డైనను... తల...నొగ్గవలసినదే!

ఆంజ:-సుగ్రీవా ! రామచంద్రుని వేదనను నేనును జూచితిని. కాని యా యుదారుని మానసికపరిణామము మాత్రము మీకుఁ దెలియదు ! రాముఁ డన్నివిధముల నిర్జిత కాముఁడు !

సుగ్రీ:-నీపక్షపాత...వచనముల కేమి !...ఆఱుమాసముల ... కాలమాత్రఁడు ... భార్యావియోగము ... ననుభవింపఁ జాలక...పలువిధముల...పలవించుచుండ ... నా... నావలె (గుండె కొట్టుకొనుచు) ... అనేకవత్సరములు... విరహము...ననుభవింపవలసివచ్చినచో ...నాతని... జితకామత... తెలసి... వచ్చును !

ఆంజ:-మిత్రనందనా ! కాముకులు లోకమంతయు దమవలెనె యున్నదనుకొనుట వింతకాదు! కాని రామచంద్రుని కామము ధర్మైకనిష్ఠమగుటచే నయ్యది చిత్తైకాగ్రత నొసంగును. మీ కామమన్ననో చిత్తోపహతికిఁ గార ణమై చిత్తవిక్షేప మొనరించును. ఆగంభీరుఁడొనరించు నదియొక సముజ్జ్వలతేజోమయతపోవిశేషము. కాముకు లద్దానిని మన్మథోద్రేకమని భ్రమింతురు !

సుగ్రీ:-(పెదవి విఱచుచు) ఏమొ... నీవంటి... శుద్ధబ్రహ్మచా రులు తప్ప...స్త్రీనిర్జితులుగాని...పురుషులుండుట... అసహజము !... అసంభవము !

ఆంజ:-(తనలో) అక్కటా! అట్టినిగ్రహసంపన్నుఁడగు సుగ్రీవుఁడు భోగపరవశుఁడై యెట్లు మాఱి యిట్టి దుస్థితికివచ్చెను ! (ప్రకాశముగ) సుగ్రీవా !

ఉ॥ సీతనుగూర్చి రాముఁడట। సేయుతపంబును జూడఁజూడ నీ
చేతనవస్తుజాతముల। చేతనమయ్యె నచేతనంబులే
చేతనమయ్యె! వేదములు। సెప్పినయట్లుఁగ సత్తునుండియీ
భూతములెల్లపుట్టెనో కా! । పుట్టెనొ కాక యసత్తునుండనున్
మిత్రమా ! స్త్రీయన నెట్టిదో రామునకె తెలియును.

సుగ్రీ:-నీవాక్యములు నాకర్థములగుటలేదు ... నేనును ...
శాస్త్రాభ్యాసమొనరించియుంటిని... మారుతీ !

ఆంజ:-కానిండు ! అన్నివిషయములుఁ గాలక్రమమున నా
రాముఁడే మీకు నిరూపింపఁగలఁడు. శ్రీరామతత్వము
మీకింతట బోధపడుట దుస్తరము ప్రభూ !

సుగ్రీ:-ఇప్పుడు...నన్నిఁక... నేమిసేయుమందువు ? త్వరగఁ
జెప్పుము !

ఆంజ:-ఎల్లి యాశ్వయుజ బహుళామావాస్య యునను కార్తిక
శుద్ధ పాడ్యమినె మనసైన్యములతో శ్రీరాముని సంద
ర్శింపఁబోవలెను !

సుగ్రీ:-అబ్బా ! అటులనా ? ఈదిక్కు-మాలిన యాశ్వయుజ
మప్పుడే వచ్చినదా ? ఆంజనేయా !

ఆంజ:-వచ్చుటా ! ప్రభూ ! రేపటితోనది పోవుచున్నది !
శ్రీరామునిమాట యటుండ లక్ష్మణుఁడు తీవ్రకోపనుఁడు
సుఁడీ !

సుగ్రీ:-మనమిపుడిఁక ముందుగసేయవలసిన పని యెద్దియో
శీఘ్రముగఁ జెప్పరాదా ? ఏల నన్నిట్లు వేదించెదవు ?
(అని విసువుతో ననును)

ఆంజ:—ప్రభూ! మీయాజ్ఞగైకొని యన్నిదిశలనుండియు మః వానరసైన్యములను సామంతులను బిలువనంపవలెను. ఇచ్చటిసైన్యములనన్నిటిని నీలుఁ డీవఱకె సిద్ధము చేసి యుంచెను

సుగ్రీ:—ఆంజనేయా! ఇంతమాత్రమునకై నాయాజ్ఞ వేఱుగఁ గావలెనా?

ఆంజ:—ప్రభునాజ్ఞ యథాతథముగ లేకున్న సామంతప్రభువుల రావించుటెట్లు?

సుగ్రీ:— అట్లయిన... నాముద్రిక... ఇదిగో (అని తనముద్రికకై తడవుకొనుచు గానక నుయ్యేలందు వెదకి తుదకు తారాదేవిని బిలిచి) తారా! నాముద్రిక నెచ్చటనో యుంచితిని!

తార:—(పరికించి) ఔను! ఇదిగో! ఇందాక పరాకున మీకటి నూత్రమనికాఁబోలు నాకాంచీగుణమున మీ ముద్రికను గ్రుచ్చితిరి! (అని తార ముద్రికనుదెచ్చి సుగ్రీవున కిచ్చును.)

సుగ్రీ:—(ముద్రికను గ్రహించి) హనుమంతా! రామకార్యసాధనము నకుఁ గావలసిన సర్వసంపత్తియు నొడగూర్చుటకై నాయధికారమంతయు నీకొసంగుచున్నాను. ఇదిగో ముద్రిక. ఇఁక నాభారమంతయు నీయదియ.(అని యాంజ నేయునకుఁ దనముద్రిక నొసంగుచు) తారా! ఈపాత్రము నందలి మద్యమయిపోయినది. మఱికొంత తెచ్చియుం చుము. (అని తనప్రక్కనున్న స్వర్ణపాత్రమును తారకందీయ క్రిందనున్న స్వర్ణఘటములోని మద్యమును పాత్రలోనింపి సుగ్రీవున కందించును. సుగ్రీవుఁడు త్రాగుచుండును)

ఆంజ: (ముద్రికను గ్రహించి మెల్లగ)

క. అర్థము ధర్మము మఱచి య
నర్థములగు కామపాన హతచిత్తులరై
యర్థా నర్థ యథార్థా గత
నర్థమునరయంగఁజాల రతిలోలాత్మల్.

సుగ్రీవా! నేఁ జేయఁగలిగినదంతయుఁ జేయుదును. నాకు సెలవొసంగుఁడు. (అని నిష్క్రమించును)

సుగ్రీ:-(తారాదేవిని యథాపూర్వముగఁ దనప్రక్కను గూర్చుండనియమించి, రుమను బిలచి డోలికపైఁ గూర్చుండి యూపుమని యాజ్ఞాపించును) తారాదేవీ! ఈసారినీవంతు...నీవొక్క...చక్కని... గీతమును, బాడుము!

తార:-(ఆంజనేయుని మాటలవలన పౌరుషముచే నజముఖిని బిలచి) అజముఖీ! కొంచెము మద్యము నిటుదెమ్ము!

ఆంజ:-(ప్రవేశించి యొకపాత్రముతో మద్యమునుదెచ్చి తారకిచ్చును. అజముఖి వెడలిపోవును)

తార:-(మద్యమునుద్రావి కోపము నభినయించుచు పాత్రమునుఁ బశపైచి యీ క్రిందిరీతి నొకగీతమును బాడును)

చ॥ సదమలకాంతితో నదుల స్వచ్ఛతనీరము తేఱెబాఱ శా
రదమున పండువెన్నెలలు రమ్యతరంజిలఁ గాయుచుండఁగా
సదనిధిజైత్రయాత్రకని యంబుజనేత్రుఁడు రాముఁడచ్చటన్
పదిలముదప్పియుండ నిటభవ్యమె యున్కి కపీంద్ర! నీవిటుల్
మదనుని పుష్పబాణముల మార్కొనఁజాలని బేలవైనచో
పదనగు రామబాణముల బాఱికి నోర్వఁగఁజాలియుందువే!

వదలుచెనెన్నఁడైననిను వంచన దుర్వ్యసనంబుసేయ కే?
పొదలెడు నీతిమార్గమును పొందుగనొందుము; మేము
మద్యముల్
వదలుదుమెుక్కొ-! నీమనము? వాడవెయెంతకు
యౌవనంబులుం కా?
పదపద! యెుందుకీగతిని పాడొనరించెదు నీదుకీర్తి; తా
సదయతనీకు రాఘవుఁడు చక్కగధర్మము బోధసేయుచో
హృదయముజల్లనైవిడుచు హేయగుణంబులుమెల్లమెల్లగన్
కదలుము వేగమంతిపురి కాంతల కల్లును నెల్లవీడి, నీ
వుదయము రాత్రి నీగతిని నుండినఁ గాలమునాపనెవ్వడి
ట్లదయత మిత్రులౌ హితుల నందఱవీడితివంచుఁజాటఁగా
నెదకలుగంగమాకు నిఁక నేలను భోగములేల ప్రాణముల్

సుగ్రీ:-(తలనూఁపుచు)తారా!... తారా!... రేపు తప్పక... రామచంద్రునొద్దకు...పోవుదును...ఔను!... రేపు కార్తిక మాసము...కదా!...అంతవఱ కూఱకుందుము. (అని తార గడ్డముబట్టుకొని బ్రతిమాలుచు చెక్కిలి ముద్దుగొనఁబోవ)

తార:-(హస్తము నడ్డుపెట్టుకొని వారించుచు, కోపము నభినయించుచు) ఊరకొనుము! సుగ్రీవా! ఇట్టి లోలతవలన నీకు విసువు జనించుటలేదా? ఆంజనేయు లేమనెనొ నీవు గ్రహింపలేదు కాఁబోలు!

సుగ్రీ:-తారా!... ఎవ్వరేమనిన నేమి?... నీదయ యున్నఁ జాలును... (అని తారను కౌఁగలింపబోవుచుండ తెరపడును)

---

# చిత్రతారకము

## ప్రథమాంకము

---

### రెండవ రంగము

రసము:-విప్రలంభము-వీరము. పాత్రలు:-రాముఁడు-లక్ష్మణుఁడు

రంగము:-[ఋష్యమూకము-సాయంకాలమున శ్రీరాముఁ డొక శిలావేదిక పైఁ గూర్చుండి-నిట్టూర్పు నిగిడించుచు]

రాముఁడు:-అక్కటా! నేనెంత మందభాగ్యుఁడను! రాజ్యము వీడి, సర్వసంపదలఁ గోలుపోయి, తుదకీ దుర్గమారణ్యమున ప్రేయసినిగూడ నెడబాసితిని! ఈశరత్కాలనిశాకరకరాళి, సీతాకర స్పర్శవలె నన్నున్మత్తునిగఁ జేయుచున్నది! (ఆకసమువంకఁ జూచుచు) అదిగో!

గీ॥ సాంద్రశీతాంశు సుఖకర-స్పర్శ తనకు
హర్షమొసఁగఁగ తారక-లల్లఁ దేల్చె।
సంధ్యజవరాలు రాగంబు-సందడింప।
జాతెతనయంత నంబర-సరణి నహాహా!॥

అల్లవిగో! పంపాసరోవర ప్రాంతమున నదీనదంబులఁ జూడ కలంక రహితంబులై:

క॥ నవసంగమ సవ్రీడా!
యువతీజనజఘనపాళి-కోడుచు నదులన్!
నవనవసికతా స్థలములు!
నవలోకిత మగుచుండాగు-నద్భుత భంగిన్!॥

లక్ష్మ:-(అంత ఫలపుష్పములు చేతఁగొని వెనుకనుండి ప్రవేశించుచు, సోదరుని జూచి తనలో) కటకటా! మా రామచంద్రుఁడు సీతకై రాత్రిం దివము లీరీతి విలపించుచున్నారు! నేఁడు కార్తిక శుద్ధాష్టమి! ఇంతవఱకా సుగ్రీవహతకుని దర్శనమే లభింపదయ్యె. (రాముని సమీపించి) అన్నా!

రాము:-(అదరిపడి వెనుకకుఁజూచి) లక్ష్మణా! బిడ్డా! వచ్చితివా!

లక్ష్మ:-అన్నా! మీరిట్లు సర్వకార్యభారమును మఱచి, నిద్రాహారముల గైకొనక, సీతావియోగ వేదనా దోధూయమానసులై మీ శరీరము నానాఁట శుష్కింప విలపించుచున్న, మిమ్మిక నోదార్చువారెవ్వరు? సాయంసమయమయ్యెను! సాంధ్యకాల్యములఁ దీర్చి మీరీ ఫలములనైన భుజింపుఁడు.

రాము:-నేఁటి తిథియేమి లక్ష్మణా?

లక్ష్మ:-నేఁడు కార్తిక శుద్ధాష్టమికదా!

రాము:-ఔను! నే నింతటనే మఱచితి! కటా! లక్ష్మణా!

క॥ అష్టమిచంద్రుఁడు నన్నిటు
లిష్టసతీ విరహతాప హింస నలంపన్
అష్టమిచంద్రునిభాళిక
కష్టంబులపాలనుండఁ గాంతునె సుఖముల్॥

ఔరా! మిత్రుడగు సుగ్రీవుడుగూడ నన్ను మఱచెను! ఇంక సీతను వెదకువారెవ్వరు? సీతా!సీతా! ఎక్కడిసీత ఏమిసేయుదును! చూచితివా సోదరా!

ఉ॥ రాజ్యముగోలుపోయి యిటు
రాత్రిదివంబు మనంబు సీతకై
ఆజ్యమువోయ మండెడి హు
తాగ్నిశిఖావళిభంగి పేర్చుచున్
పూజ్యతలెల్లఁబోవ వన
భూములఁ గాఱియఁజెందునే ధను
స్సజ్యము సేయఁజాలనని
సన్నగ నాతఁడు నన్నుజూచెడిన్!॥

లక్ష్మః-అన్నా! నేనిప్పుడ కిష్కింధకుఁబోయి యా సుగ్రీవుని హతగ్రీవుని జేసి యంగదుని వానర రాజ్యాభిషిక్తునిగ నొనరించి వచ్చెదను. ఇఁకసీత నంగదుఁడు వెదకుఁగాక!

రాముః- మన చేతులతో నాటిన మొలకను మనమె త్రుంచుటా?

క॥ తనయుఁడు తమ్ముఁడు మిత్రుఁడు।
ననయము నీమువ్వురిలను-హంతవ్యులుగా।
రనయమున మెలఁగిరేనియుఁ
బనిఁగొనవలె వారివలన-భయ నయములచేన్॥.

లక్ష్మ:-అటులైన, తీవ్రదుర్వ్యసన నిమగ్నుఁడగు సుగ్రీవుని నయ మార్గమునకుఁ ద్రిప్పు టెట్లు?

రాము:-కానిమ్ము! సోదరా! సుగ్రీవుని యదృష్టవశమున నాతని కాంజనేయుని యట్టి నయజ్ఞుఁడు మంత్రియయ్యెను. ఆ మారుతి, యాయర్కజుని నీతిమార్గమునకుఁ దేకుండ నుండఁడు. లక్ష్మణా! వాతాత్మజుఁడు సామాన్య కపి మాత్రుఁడు కాఁడుసుమీ!

గీ॥ వేదసారంబు నెఱిఁగిన-వృద్ధసేవి!
మంత్ర తంత్రజ్ఞుఁడైనట్టి-మహితమూర్తి!
నీతిశాస్త్రాబ్ధి గతుఁడైన-నియమశాలి!
వానరాకార మొందిన-భానుఁడతఁడు!॥

లక్ష్మ: కానిండు! ఆతడెంత ప్రతిభావంతుఁడైన ప్రభువు సుగ్రీవుఁడు. కామపరతంత్రుఁడగు నాకపిరాజు మంత్రియగు నాంజనేయుని యుపదేశము సరకుఁగొనునా?

రాము:-సుగ్రీవుఁడంతమూర్ఖుఁడందువా లక్ష్మణా!

లక్ష్మ:-అన్నా! తీవ్ర విషయ నిమగ్నులగు వారు మాటలచే మరలుదు రనుకొనుటకు వీలులేదు. (అంత కిష్కింధలో సుగ్రీవాంతఃపుర కాముక జనకోలాహలములు వినవచ్చుచుండును) చూచితిరా! రామచంద్రా! సుగ్రీవాంతఃపుర మదిరా పానమత్తజన కలకలము లిచ్చటికిగూడ వినవచ్చుచున్నవి! అట్టి పానాసక్తులగు కాముకుల యున్మత్తత మాటలచేఁ బోవుట కల్ల.

ము:-ఔను! పానమత్తులను భయముచేగాని శుభమార్గమునకుఁ దేజాలము. నీవు కిష్కింధకరిగి యా కపిరాజుతో నామాటగా నిట్లనుము.

గీ. వాలిఁబొటిగొన్న బాణంబు వాడిమెఱయ
తొంగలించెడు నక్షయ తూణమందు
నాలుకలు గోసియుచున్నవి వాలు దొనలు
భ్రాతృమార్గంబు బట్టక బ్రతుకుమనుము॥

లః- అట్లైన నేను వెంటనె కిష్కింధకుఁబోయి యా కపిమూర్ఖుని యున్మాదము దగురీతిని బోఁగొట్టివచ్చెదను. నాకు సెలవొసఁగుఁడు.

ము:-బిడ్డా! సుఖముగబోయి కార్యమునుసాధించుకొని రమ్ము (మరల కొంచెమాలోచించి) పోనిమ్ము! సోదరా! శాంతముగనె యాతనితోఁ గాలాతీతమయ్యెనని దెల్పుము. నిష్ఠురోక్తులతో నాకపిరాజు మనమును నొప్పింపకుము. మనమాతని బూర్తిగపరీక్షింపక యే మైత్రినొనరించియుంటిమి! ఇఁక నాతని నొప్పించిన నేమిలాభము?

క. శుభమైనఁ బాపమైనను।
నభిరూపుఁడటంచు మిత్రు హస్తముబట్టన్।
విభవము లెగూర్ప నాతని।
కభిమతముగ గొండ్రు జగతి నభిజాతఘనుల్॥

లక్ష్మ:—కానిండు! అన్నా! ప్రస్తుతమెట్లయినను గార్యమును సాధింపవలెనుకదా! నేనట్టియత్నమునె యొనరింతును. నాకనుజ్ఞనొసంగుడు. (అంత లక్ష్మణుడు కొంచెముముందునకు వచ్చును. రామునకును లక్ష్మణునకును మధ్య తెరపడును) ఆహా! మా రామచంద్రుడెంత దయార్ద్ర హృదయుడు! భయమునంగాని పానాసక్తుల నీతిమార్గమునకుఁ దేజాలమని పూర్తిగ నెఱింగియు, నిష్ఠురములాడవలదని నన్నాజ్ఞాపించుటఁజూడ, నీచతుస్సముద్రవిస్తీర్ణమునకైన నవధి కలదుకాని, మా రాముని కరుణాసముద్రమున కవధియే లేదుకదా! నేనిఁక నెట్లైన రౌద్రరసమును పూర్తిగ నభినయించి యీ పిఱికిదాసగు సుగ్రీవుని భయపెట్టినంగాని యాతఁడు మనకుఁ గలసిరాఁడు. (అని ధనుర్బాణములను ఖడ్గకవచములనుధరించి భూమియదరునట్లు నడచుచు నిష్క్రమించును.)

(తెరదింపవలెను)

---

# చిత్రతారకము

## ద్వితీయరంగము



### ఒకటవరంగము

రసము:-రౌద్రము, భయానకము, కపిచేష్టలు, హాస్యము.

పాత్రలు:-లక్ష్మణుఁడు, అంగదుఁడు, ప్లక్షపరిభావులు, కపులు.

రంగము:-(కిష్కింధలో రాజవీథి-కపు లటునిటుఁ దిరుగుచుందురు. లక్ష్మ
ణుఁడు దూరమునుండియె ధనుష్టంకారముజేయుచు ప్రవే
శించును కొందఱు కపు లాతనిఁజూచి భయముతోఁ
బాఱిపోవుచుందురు.)

లక్ష్మ:-(ప్రవేశించుచు తెఱలోనుండియె ధనుష్టంకారము సేయుచు)

శా॥ ఏఁడీ! మీకపిరాజు! చూడ నెచటో
యేమూలనోడాగెనే!
రాఁడా మారఘురాము సన్నిధికి? తా
రమ్యంబుగా స్త్రీలతోఁ
గ్రీడాపాన నిమగ్నచిత్తుఁడగుచుఁ
గిష్కింధలో మ్రగ్గెనే!
నేఁడే చూడుఁడు! గూల్చివైతు నతని
న్దీప్తాగ్ని బాణాహతిన్!॥

(అని సింహనాదములు సేయుచు ధనువునెత్తి రెండుబాణములు లాఘవము వంక విడువ నవి మంకుచు రింగురింగున ధ్వనితోఁ బైకెగసి కొంత వడికి మరల నాతని తూణమునందుఁ బ్రవేశించును. అంతఁగపులందఱు ఘీంకారములు సేయుచు పరువులిడుచుందురు.)

ఒకవానరుడు:-అరే! వీఁడు మన వాలిని జంపినవాని సోదరుఁడు! మనలఁగూడ జంపుటకు విల్లమ్ములఁ బూని వచ్చియు న్నాఁడు! ఏది తాయి (అని యొకజాతినెత్తును)

వేఱొకఁడు:-అరే నేనొకచెట్టును పెల్లగించి తెచ్చెదనుండుము (అని పరువెత్తి యొకచెట్టుకొమ్మతో మరల ప్రవేశించును.)

మఱియొకఁడు:-(పరుగెత్తుచు నాట్యము సేయుచు వెక్కిరించుచు)భం... భం...భం...ఇహిహీ! ఇహిహీ! (అనుచు పండ్లిగిలించుచుండ మఱిఁగొందఱు శృంగినాదములు సేయుచుందురు. ఒకకోఁతి తెరచాటుననుండి లక్ష్మణుని ముందుకుదూఁకి మరలఁ బాఱిపోవును)

లక్ష్మ:-(ధనుష్టంకారము సేయుచు పండ్లు పటపట గొఱుకుచు) ఆహా! ఏమీ! ఈసుగ్రీవుని రాజ్యమెంత యల్లకల్లోలముగను న్నది! ప్రభువె త్రాఁగుబోఁతగుచో నిఁక నాతని రాజ్య మంతయు నిట్టి యల్లరిమూఁకలతో నిండియుండుట కాశ్చర్యమేమి? (ధనువున మరల నొక యిషువును దొడిగి) చూడుడు! మిమ్ములనందఱి నేకమాత్రమునఁ బొరిఁ గొందును (అని బెదరించుచుండ నాకోలాహలమునంతయుఁజూచి యంగదుఁడు సత్వరముగవచ్చి)

అంగదుఁడు:-(ప్రవేశించుచుఁ దెరలోనుండియె చేతుల నడ్డముపెట్టి వారించుచు) లక్ష్మణా! లక్ష్మణా! వలదు! వలదు! దయసే

యుము! దయసేయుము! అకపులందఱు భయముచే నట్లు చెలరేఁగిరి. కోపింపకుఁడు! గోపింపకుఁడు! (అని కపుల నావలికిఁ బాఱఁద్రోలును)

లక్ష్మ:- (అంగదునిజూచి శరమును మరలనిమంగమూనందుంచి) అంగదా! మీపినతండ్రి రాజ్యము సేయుచుండెనా? ఆతని రాజ్యమంతయు నిల్చి యున్నదా?

అంగ:-(శాంతముతో) రఘుపుంగవా! మాకపికుల చక్రవర్తి యంతఃపురమున నున్నారు. మీరిచ్చటికి వచ్చినట్లాయన యెఱుంగఁడు.

లక్ష్మ:-(కోపముతోఁ దలపంకించుచు) ఆతఁడు దన యొడలినె మఱచెను! మాయునికి నీక నెట్లాతఁడు గుర్తింపఁగలఁడు?

అంగ:-లేదు! లేదు! తనకు రాజ్యప్రదాన మొనరించిన యుదారమూర్తులను మఱచునంతటి మూర్ఖుఁడుగాడు మాసుగ్రీవుఁడు సౌమిత్రీ!

లక్ష్మ:-(ఆటోపముతో) నీపితృభక్తి నిన్నాతఁడు ధూర్తుఁడని యననిచ్చుటలేదు!

అంగ:-రఘూత్తమా! మీరట్లనవలదు. నేనిప్పుడపోయి మీరాక మా మహారాజునకెఱింగించి పుచ్చెద.

(ఇంతలో ప్లక్ష ప్రభావులను నిపుణ సుగ్రీవామాత్యులు ప్రవేశింతురు.)

ప్లక్ష ప్రభావులు:-రామానుజా! మేమిరువురము ప్లక్షప్రభావులనువారము. మేము సుగ్రీవమహారాజున కాంతరంగికులము. తమరు మాప్రభుని పగరువద్దకు విచ్చేయుఁడు.

మేమీ యంగదరాజకుమారునితోడఁ గూడనేఁగి మీ రిచ్చటి కరుదెంచితిరని మాచక్రివర్తికి నివేదింతుము. దయచేయుఁడు !

లక్ష్మ:-(కోపముతో) సుగ్రీవమందిరమునకు నేను వచ్చుటా ! ఏమీ ! స్త్రీలోలుఁడగు మీప్రభువు నా మొగమెట్లు చూడఁగలఁడు ?

అంగ:-లక్ష్మణా ! మీరు మా వెంటవిచ్చేయుఁడు. మీవంటి ధీయుతులకుఁ గార్యము సాధించుటపాడిగాని ఖడ్గము నెత్తుట ధర్మముకాదు.

లక్ష్మ:-(కోపముతోఁ దన మొలనున్న ఖడ్గముపైఁ జేయివైచి) ఖడ్గముచేఁ గాని మీప్రభువు కార్యరంగమునకు దిగునట్లులేదు !

స్త్రీప్రభా:-మీరట్లనవలదు. మా సుగ్రీవమహారాజెల్లప్పుడు రామచంద్రునిఁదలంచుచునేయుండును. లక్ష్మణా! మీరె కదా యాప్రభుని శిరమందుఁ గిరీటము నలంకరించితిరి.

లక్ష్మ:-అదియంతయు నాతనికింకను జ్ఞాపకమా ? వానరము గ్నులు కృతమెఱుంగుదురా ?

స్త్రీప్రభా:-సౌమిత్రీ ! మిమ్మెప్పటికాతఁడు మఱువఁజాలఁడు. మేమిప్పుడ నీ యంగదసమేతముగఁబోయి యొక్క త్రుటిలో సుగ్రీవుని మీయొద్దకుఁ గొనివత్తుము. మీరు తక్షణక నగరున కు విచ్చేయుఁడు.

అంగ:-(లక్ష్మణుని హస్తము బట్టుకొని) రామానుజా! దయసేయుడు! అలుకబూనకుఁడు. మాకపిరాజు మీకు మిత్రుఁడుకదా!

(అంగదుఁడు లక్ష్మణుని చేయిబట్టికొని ముందు నడుచుచుండ నాతని వెనుక ప్లక్షప్రభావులు నడుచుచు సుగ్రీవాంతఃపుర ప్రాంగణము నకుఁ బోదురు)

(సుగ్రీవాంతఃపుర ప్రాంగణమున-పురోభాగమున నుద్యానవనమున-చూతవృక్షశ్రేణియు నుండును-అందొక చూతవృక్షము క్రింద చలువ రాతి తిన్నెపై)

ప్లక్షప్రభా:-లక్ష్మణా! మీరీ చూతవృక్షచ్ఛాయనున్న యీ చలువఱాతి తిన్నెపై విశ్రమింపుఁడు. మేమిప్పుడవోయి సుగ్రీవుని గొనివత్తుము.(అని చూతవృక్షచ్ఛాయనున్న తిన్నెపై లక్ష్మణుని గూర్చుండఁబెట్టి అంగదప్లక్షప్రభావులు నిష్క్రమింతురు. అంతలక్ష్మణుఁడా చలువఱాతి తిన్నెపైఁ గూర్చుండ సుగ్రీవాంతః పురోద్యానమునుండీ క్రిందిరీతి నొకగీతము వినఁబడును.)

(తా రా మా లి క)

ఉ॥ తాటకఁజంపిజన్నమున-దైత్యులఁదోలి యహల్యచెందునా।
రాటము మాన్పివిశ్రమము-రాజిలభీకరచాప భంజనా।
పాటలగంధి సీతనటు - పాణిని పీడనమాచరించి, యా।
పాటనె జామదగ్న్యఘన-పాటవమెల్లను వీటిబుచ్చి, య।
ప్పాటికినేఁగి కైకవర - విహ్వలుఁడై దిగులొందు తండ్రి జం।
జాటములెల్లఁ దీఱుటకు [illegible], ను।
గ్రాటవికేఁగి, మేటియగు - రాక్షసవీరుల[illegible]డంచి, నా।

నాఁటికిఁ బంచవాటి నర - నాథుఁడుచేరి వసించియుండ, న।
చ్చోటికి వచ్చి శూర్పణఖ-సుందరవేషముఁ దాల్చిసీతకుం।
జేటుదలంచి పీడనము - సేయఁగఁ బోవఁగఁ గర్ణనాసికల్ ।
సూటిగఁబట్టి లక్ష్మణుఁడు-నూఁడఁగఁగోయు, ఖరాదిసోదరుల్।
పోటరులై నరేంద్రసుతుఁ - బోరునఁదాఁకిన వారినందఱిం।
గీటడఁగంగఁగూల్చె రఘు - కేసరి, యూపతిఁ గోపమెత్త, నా।
కూటమికెల్ల పెద్దయగు - క్రూరుఁడు రావణుఁడంత నేమఱిం।
బాటున రాముఁడుండఁగని - మాయలరక్కసు లేడి, జేసి, తా।
మాటునఁడాగి దూరముగ-మానవముఖ్యులఁ బోవనిచ్చి వే।
బూటకవిప్రవేషమున - భూమిజ దొంగిలి లంకఁజేర, నా।
హాటకగాత్రిఁ గానకడి - యాసలగాసిలి, పక్షిరాజుకుం।
జేటునిశాట హేతిహతి-చెందఁగ మిత్రుని సంస్కరించియా।
బాటలనెల్లఁగాంచుచు, క-బంధుఁడు సెప్పఁగ నెట్టకేలకుఁ।
నేఁటికిఋష్యమూకమున-నిన్నుకనుంగొని మైత్రిపెంపు, మో
మోటకుఁజేసి రాఘవుఁడు - మున్నగశీఘ్రము నీకుఁగల్గుచే।
డ్పాటును బాపె, నీవతని-భార్యను దెచ్చుకొనంగ సాయమా।
పోటుమగండవంచుఁ దన-పోలిన మిత్రుఁడవంచు నెంచుచుం।
గూటికిఁగూడదూరమయి-కూర్చునుజెందక, కొండమీఁదబల్
పాటులఁజెందు రామనర-పాలునిగాంచి వివేకమొప్ప నీ।
మాటఁదలంచి సీతఁగను-మార్గము నారసి రామచంద్రు కా।
బోఁటిని దెచ్చియిచ్చి, కపి-పుంగవ శాశ్వతకీర్తిఁ గాంచుమా!॥

లక్ష్మ:-(చెవియొగ్గివినుచు) ఆహా! ఇయ్యది తారాదేవి యెటులంగు
వలె నున్నది! మా రామచంద్రునియం దామెకుఁగల
భక్తి యనర్గళము! కాని సుగ్రీవుఁ డొట్టిపశువు. మూర్ఖ
లగు పురుషులకు సూక్ష్మబుద్ధిగల వనితలంగూర్చు
విధాత నేమనవలెనో తెలియుట లేదు! ఇఁక నెట్లైన
నాథనుస్సంరంభముచేఁ గాని యాకపిరాజునకు వివేక
మబ్బునట్లు గాన్పింపదు! అంగదాదులు తిరిగివచ్చునంత
లోనే నీభూగర్భస్థిత విచిత్రపట్టణము నొకసారిచూచి
వచ్చెదను. (లక్ష్మణుఁడు పట్టణము చూచుటకు వెడలును.)

(తెర పడును)

---

# చిత్రతారకము

## ద్వితీయాంకము

---

### రెండవ రంగము

రసము:— శృంగారము, భయానకము  పాత్రలు:— సుగ్రీవుఁడు, తార, రుమ, అజముఖి. నాట్యస్త్రీలు, అంగదుఁడు, ప్లక్షప్రభావులు, ఆంజనేయులు.

రంగము:—(కిష్కింధలో సుగ్రీవాంతఃపురమున, రుమాతారలతో సుగ్రీవుఁడు హంసతూలికాతల్పమునఁ గూర్చుండియుండ స్త్రీలు నృత్యము చేయుచుందురు. సుగ్రీవుఁడు రుమాతారల భుజములపై చేతులుంచి నాట్యమును జూచుచుండును.)

అజముఖి:— (చల్లగ వెనుకనుండి ప్రవేశించి తారాదేవి యొద్దకుఁబోయి ఆమెతో మెల్లగ) దేవీ! అంగదరాజకుమారుఁడు ప్లక్షప్రభావులతో మహారాజును సందర్శించుటకై ద్వారమువద్ద వేచి యున్నాఁడు.

తార:— (చేసన్నచే నాట్యముమాప సుగ్రీవుఁడు తారవంక చూచును.) నాథా ! అంగదుఁడు ప్లక్షప్రభావులతో వచ్చి మిమ్ముఁ జూచుటకు వేచియున్న ట్లజముఖి చెప్పుచున్నది ఎద్దియో తీవ్రసంఘటనము నామానసము శంకించుచున్నది.

సుగ్రీ:- (తార భుజముపైనుండి తటాలున చేయితీసి) ఆఁ! తారా! నీకట్టిభయము కలుగుటకు హేతువేమి! రుమా! కొంచెము పానీయమునందుకొనుము. (అంతరుమ శయ్యనుండి దిగి స్వర్ణపాత్రితో మద్యము నందించును. సుగ్రీవుఁడు ద్రావిపాత్రము మరల రుమకందీచు నామె పాత్రము మరల మద్యముతో నింపి సుగ్రీవుని కెదురుగనున్న పీఠముపై నుంచును.)

తార:- సుగ్రీవా! అంగదాదులిట్టి సమయమున వచ్చియుండుట కేద్దియో కారణముండును. మీరిట్లు భోగపరవశులై యుండ శ్రీరాముఁడేదేని నిష్ఠురసందేశ మంపి యుండును.

సుగ్రీ:- నేనిప్పుడొనరించిన తప్పేమున్నది? మన కార్యభారమంతయు నాంజనేయునిపై నుంచితివి కాదా దేవీ!

తార:- శ్రీరామునకు మీరిచ్చిన వాగ్దానమును చెల్లించుటకు కాలాతీతమగుచున్నదని మన కాంజనేయులు చెప్పియుండెనుకదా!

(ఇంతలో నావలవీధినుండి ధనుష్టంకారశబ్దములు కపుల కోలాహలములు వినబడును)

సుగ్రీ:- (అదరిపడి పాన్పునుండి డిగ్గనుఱికి, నాట్యముసేయుచుండిన స్త్రీల నావలకుఁబంపి) తారా! అంగద ప్లక్షప్రభావులను వెంటనే ప్రవేశపెట్టుము! (అని యాతురతతో ననుచు) తారా! నేనిప్పుడొనరించిన దోషమేమి? ఆధనుష్టంకారశబ్దము లెచ్చటనుండివచ్చుచున్నవి? రుమా! ఆ మద్యము నిటు దెమ్ము! (అంత రుమ పీఠముపైనుంచిన మద్యమునందీయ కపిరాజు క్రిందపఱచియుంచిన రత్నకంబళముపైఁ గూర్చుండి త్రాఁగుచుండ నజముఖిపోయి యంగదాదులతో మరలఁ బ్రవేశించును)

(అంగద ప్లక్షప్రభావులు ప్రవేశింతురు. అజముఖి వెడలిపోవును.

రుమ సుగ్రీవునిచేతిపాత్రమునందుకొని మరల పీఠముపైనుంచును. అంగదుఁడు రుమాతారలకు సుగ్రీవునకు నమస్కరించి ప్లక్షప్రభావులతో నిలచియుండును. రుమా తారలు సుగ్రీవున కిరువైపులఁ గూర్చుందురు.)

సుగ్రీ:-అంగదా ! ఏలసింతతొట్రుపాటుతో వచ్చితివి ? ఆ ధనుశ్శబ్దములును కపుల కోలాహలములేమి ? అని( యాత్రముతో నడుగును).

అంగ:-మహారాజా ! ఏమి సెప్పుదును !

మ॥ ప్రళయాగ్నిచ్ఛటభంగి లక్ష్మణుఁడ దే-ప్రాగ్ద్వార దేశంబునన్।
వలయాకారధనుర్విముక్త విశిఖ-వ్రాతంబుతో నందఱన్।
విలయంబొందఁగఁ జేయఁజూచినను-నే వీక్షించివారించితిన్॥
కలఁగెన్ జూడుము నీపురంబునిఁక వే-కావంగయత్నింపుమా॥

ప్లక్షప్రభా:-సుగ్రీవమహారాజా! మేముగూడ నాదశరథనందనునిఁ జూచితిమి!

దక్షయజ్ఞవిధ్వంసము సేయ నవతరించిన వీరభద్రునివలె నాతని తీక్ష్ణతేజమ్ముదుర్నిరీక్ష్యముగనున్నది !

సుగ్రీ:-ఏమీ! తారాదేవీ! మనయందు లక్ష్మణుఁడంత యాగ్రహావేశమును జూపుటకుఁ గారణమేమి !

తార:-నేను చెప్పుచుంటిని కాదా ! మీరు రాముని సందర్శించుట కాలసించితిరని ! ఆరఘుపుంగవుఁడు సోదరునిబంపియుండును. లక్ష్మణుఁడు తీవ్రకోపియని మన కాంజనేయు లప్పుడే చెప్పెను !

సుగ్రీ:- అంగదా ! మంత్రిసత్తముఁడైన మన యాంజనేయు లచ్చట లేఁడా ?

అంగ:-అచ్చట నాతఁడు లేఁడు. అతఁడు సేనాసంగ్రహకార్య నిమగ్నుఁడై యున్నాఁడు. ప్రభూ! ఇఁక మీరు తత్క్షణమె లక్ష్మణుని దర్శించి యాతని సమాధానపరుపకున్న నావలఁజింతించిన లాభము లేదు. అతఁడీ పట్టణమంతయు గాల్చివేయు నేమొ యని యనిపించుచున్నది.

సుగ్రీ:-అబ్బా! సౌమిత్రియంత కోపింపఁబనియేమొ నాకగపడుట లేదు! అంగదా! నీవు సత్వరముగఁబోయి యాంజనేయుని నీవెంటఁ గొనిరమ్ము. నేనిప్పుడు లక్ష్మణుని జూచుటకుఁ జాలను. (లక్ష్మణుని తీవ్రధనుష్టంకారములు మరల వినఁబడును. అంగదుడు నిష్క్రమించుచుండ సుగ్రీవుఁడు రుద్ధకంఠస్వరముతో) అంగదా! నీవీ పాణిద్వారమున నరుగుము! లక్ష్మణుఁడు వీధిలోనుండు నేమో!

అంగ:- (పాణిద్వారమున నిష్క్రమించుచు) ప్రభూ! నేను వెంటనే యాంజనేయునిగొనివచ్చెదను. మీరెట్లులైన లక్ష్మణునూఱడించు నుపాయమాలోచింపుఁడు. ఆతఁడు నగరమును చుట్టివచ్చుచున్నట్లు దోఁచెడిని. (అంగదుఁడు నిష్క్రమించును)

సుగ్రీ:-(మరల మంత్రులఁజూచి) అమాత్యవరులారా! మనమిప్పుడేమియుఁ దప్పొనర్పలేదే! అక్కటా! రామచంద్రుఁడేల నాపై యలుగవలసివచ్చెను!

ప్లక్షప్రభా:-ప్రభూ! మానవచిత్తము లతిసూక్ష్మతరములు శ్రీరాముఁడు నిశితధర్మప్రవర్తకుఁడు కర్తవ్యతావిషయములందతఁడొక్క నిమేషకాలముగూడ దాఁటిపోనీయఁడు!

సుగ్రీ:- నేనిప్పు డొనరించిన కాలాతిక్రమణ దోషమేమున్నది ?

ప్లక్షప్రభా:- కార్తికమాసము వచ్చిన వెంటనె మీరు శ్రీరాముని దర్శించి యచ్చట నొనరించుచుండిన ప్రయత్నములంగూర్చి విన్నవించి యుండినచో నాతఁడిట్టి తీవ్ర సందేశ మంపియుండఁడు.

సుగ్రీ:- ఆంజనేయులుపోయి చెప్పియుండఁడా !

ప్లక్షప్రభా:- ఆంజనేయు లచ్చటికిఁ బోయినచో నా రఘుసింహుఁడు మీప్రభు వేమిచేయు చుండెనని యడుగవచ్చును. అప్పుడాతఁడు నిరుత్తరుఁడు గావలసి వచ్చునుకదా!

సుగ్రీ:- తారా ! నీయెదుటనే కాదా నేనా మారుతిపైఁ గార్యభారమంతయు నుంచితి నని చెప్పియుంటిని. ఇఁక నాతఁ డేల రామచంద్రుని యొద్దకుఁజని యచ్చటి విషయములఁ జెప్పరాదు ?

తార:- నాథా ! అంజనేయులు మిగుల సూక్ష్మబుద్ధికలవాఁడు. చీటికిని మాటికి నాతఁడు పోయి నాప్రభునస్వస్థుఁడుగ నుండుటచే నేనిట్లు దౌత్యమొనరించుచుంటినని సెప్పినచో, రామునకు మీయందెట్టి గౌరవముండదు.

ప్లక్షప్రభా:- అంతియకాదు ప్రభూ ! మీయుదాసీనతచే వాలివలె మీరును కామవశ్యులై రావణుని మాయావాగురములఁ దవులుగొనిరేమొ యని రాముఁ డూహింపవచ్చును. ప్రభుహృదయము లతిగహనములు కదా ! ఒకవంక రావణుని వేగులవాండ్రును గూఢచారులు హెచ్చుగ దిరుగు చున్నారు.

(అంతనంగదహనుమంతులు ప్రవేశింతురు)

ఆంజనేయులు:-(ప్రవేశించి) సుగ్రీవమహారాజా! నమస్కారము.

సుగ్రీ:-ఆంజనేయా! మన లక్ష్మణుఁడేల నంత కోపోద్రిక్తుఁడై యేతెంచెను. రఘుపుంగవులకు మన మొనరించిన లోపమేమి ?

ఆంజ:-ప్రభూ! కార్తిక మాసారంభముననె రామచంద్రునిఁ గలసికొని సీతాన్వేషణ యత్నమును గావింతుమని మీరు సమయము జేసి కిష్కింధలోఁ బట్టాభిషిక్తుల రైతిరి కదా!

సుగ్రీ:-ఔనౌను! (తొట్రుపాటుతో) నేఁటి తిథి యేమి?

ఆంజ:-నేఁడు కార్తిక శుద్ధ నవమి ప్రభూ!

సుగ్రీ:-ఇసీ! ఇంతియేనా! ఒక్కవారముదినము లాలసించి నంతమాత్రమున నాపై లక్ష్మణుఁ డింత యలుక బూనెనా ?

ఆంజ:-రాజా! ఒక్కనిమేషకాల మాలసించిన సులభసాధ్యము లగు కార్యములుగూడ దుష్కరములై విషమించును. సీతాన్వేషణము సామాన్యకార్యమా ప్రభూ!

సుగ్రీ:-నీనిప్పుడేమియుఁ దప్పొనర్పలేదని నానునిశ్చితాభిప్రాయము. వారమాత్రాలస్యమున కింతగ,నాగ్రహించుటా!

ఆంజ:-కార్తికము ప్రారంభించి తొమ్మిదిదినములు గడచినవి. మీరీవ్యసనములందుబడి కాలమును గుర్తించుటెట్లు?

క॥ మిక్కుటమగు సంపదలను
రొక్కటపడా వ్యసనభోగ - రోగములందున్
పక్కనఁ గాలముపైఁబడి
స్రుక్కింపదె జనుల దండ - శోకముభంగిన్ ?.

గీ॥ మిగుల నైశ్వర్యమబ్బిన - మిట్టిపడక
వ్యసనమొక్కటముసరినఁ - బసయుఁ జెడక
రెంటమధ్యను జంతువు - లుంటవలన
లోకయాత్రల యుక్తిమై - బోకచెల్లు.

సుగ్రీ:-ఏమైననేమి ! లోకములో మిత్రులను లెక్కకు మిక్కిలి సంపాదింపవచ్చును. కాని స్నేహధర్మము నిర్వర్తించుటలో ననేకవిషమసంఘటన లేర్పడుచుండును.

ఆంజ:-శ్రీరాముఁడు తనమిత్రధర్మము నెట్లువిశాలహృదయముతో నిర్వహించెనో మనము గుర్తింపఁగలిగినచో నాధర్మపరిపాలనమునందు మనముగూడ నట్లనె మెలంగఁగలము ప్రభూ !

సుగ్రీ:-రాముఁడుమాత్రము మనపై నవ్యాజప్రేమచే మనసఖ్యము నపేక్షించెనా ? మనసాహాయ్యముకొఱ కింతమాత్రము వేచియుండరాదా ?

ఆంజ:-(తనలో)అహా! వాలిచేబన్నముపడి దశదిశల గ్రుమ్మరుచు, ఋష్యమూకమె శరణ్యముఁగ పరితపించుచుండెడి సుగ్రీవుఁడు నేఁడీతీఱున మారుటఁజూడ కష్టములె జీవులను సత్వగుణసంపన్నులుగ జేయుననుట నిర్వివాదము!(ప్రకాశముగ) కపినాయకా! మీరిట్లనుట మీ భోగోపహత

చిత్తముచేతఁగాని వేఱొకటియుం కాదు! శ్రీరాముఁడు సర్వసమర్థుఁడు.

ఉ. సాలములేడు నేలఁబడ [illegible] యొక్కటిచేత, వ్రేలితోఁ
దూలఁగనేసె తూలముగ దుందుభికాయము, నొక్కకోలకే
వాలిని కూలనేసిన యపారపరాక్రమ మెల్లఁ జూచియుం
బోలునె రామునిట్లనఁగ-పొత్తున పూజ్యులు నిన్ను మెత్తురే?

చ. ధనువును చేతఁబట్టగనె-తత్తరజెందును మూఁడులోకముల్
మనుగడగాంచునాతఁడటు-మాన్యకృపామృతదృష్టిఁజూచినన్
వినుము హరీశ! నీవునిటు-వేఱ్పడివాచును జుల్కనాడఁటా!
ఘనశరబద్ధరామనిజ-కార్ముకతీవ్రత వాలి కూలఁగన్॥

తార:-కపిరాజా! ఏటికిట్టి వృథాప్రసంగము? మీ క్షేమముఁ గోరువారీ మారుతికన్న వేఱెవ్వరు? ఆతఁడనినట్లు, కార్య గౌరవమును కాలవేగమును భోగపరవశుల కెట్లుదెలియును?

ఆంజ:-కపిచక్రవర్తీ! మనమొక కార్యము సేయుదుమని యొకరికి వాగ్దానమొనరించినప్పుడు మనకా యభ్యర్థులు జ్ఞాపకముసేయుకమున్నె మనమాపనిని జేసిన మనఘనత. అట్టితఱి మనకు ముందుగ నుపకారమొనరించిన పూజ్యులకుఁ బ్రత్యుపకృతియొనరింతుమని ప్రతినసేసి వారివలన మనము హెచ్చరింపఁబడుచో నిఁక మన ప్రతికృతి కెట్టి విలువయుండును?

సుగ్రీ:- నేనప్పుడుచేసిన వాగ్దానము నిప్పుడు చెల్లించుటకు యత్నములను సలుపుచుంటినికాదా!

ఆంజ:- మహత్తరకార్యముల సాధింపఁగడంగువారు బ్రహ్మ చర్యమును మనోనిగ్రహమును పాటింపవలెను. మిమ్మట్టి శ్రేయోమార్గమునఁబెట్టుటకె రామచంద్రుఁడు తనసోదరునిటకుఁ బంపెనని నాయూహ.

సుగ్రీ:-అందులకై నాకు హితవుగఁజెప్పుటకు మాఱు నాపై లక్ష్మణుఁ డలుకవహింప పాడియా ?

ఆంజ:-గురుతుల్యులగు పెద్దలు వేదవాక్యములవలె తమరు శాశింతురు. అవి మన కవస్యసమాదరణీయములు. అందుచేతను శ్రీరామచంద్రుఁడు త్రిలోకగురుఁడగుట మీకు నేను వేరుగ చెప్పనక్కఱలేదు.

సుగ్రీ:-కాని ! యెవ్వరో నాపై నా రామానుజునితోఁ గొండెములు చెప్పిరి ! లేకున్న నాయెడ సహజముగ మృదు స్వభావమును ప్రకటించెడి సౌమిత్రి కింత యాగ్రహమునకుఁ గారణము నాకుఁ గానరాదు.

ఆంజ:-అక్కటా !

క. తనకర్మమె తనమిత్రము
తన కర్మమె శత్రువగుటఁ-దలపక జడుఁడై
జనుఁడిల లగ్గును నెగ్గును
తన కితరులుసేసి రనును-తారానాథా !

సుగ్రీవా ! మిమ్మానాఁడు వానరరాజ్య పట్టభద్రునిఁగఁ జేసిన యుదారమూర్తుల కీనాఁ డాగ్రహముతోఁచుట కెవ్వరు బాధ్యులో మీ హృదయమును బరీక్షించుకొనుఁడు !

సుగ్రీ:- కానిమ్ము ! ఇఁక నీకాకదంత పరీక్షవలన నేమిలాభము! నీవు సైన్యములన్నియు సిద్ధము సేయించితివా? ఆంజనేయా!

ఆంజ:- పెక్కు సైన్యములు కూడినవి. ఇంకను కొంద ఱాలసించు-చున్నారు! వారికొఱకై మరల దూతల నంపవలెను.

సుగ్రీ:- కార్తికమాసమునఁ బదిదినములు గడుచుచున్నవి! ఇంకను కొందఱాలసించుచుంటిరా? నన్నిప్పుడేమి సేయమందువు?

ఆంజ:- ప్రస్తుత మెట్లనో లక్ష్మణుని శాంతింపఁజేసి యనంతరము మన సైన్యములతోఁ ద్వరగ రామచంద్రుని దర్శింపఁ బోవలెను.

సుగ్రీ:- ఇఁక నా లక్ష్మణుని కోపము జల్లార్ప మా తారాదేవియె సమర్థురాలు. (తారవైపుదిరిగి) తారా! నీబుద్ధికుశలతవలన లక్ష్మణు నెట్లైన శాంతింపఁజేయవలె. వీరులు తమ యాగ్రహమును స్త్రీలపైఁ జూపరు. శ్రీరామునియందు నీవు మిగుల భక్తిగలదానవు. ఈపనికి నీవె పూనుకొన వలెను. ప్రసన్నవదనుఁడగు సౌమిత్రినిమాత్రమె నేను చూడఁగలను. తారా! నీవుపోయి యాతనిఁ దేర్పుము. (అని తారగడ్డము బట్టుకొని బ్రతిమాలును)

తార:- రాజా! మీయానతి నేనవశ్యము నిర్వర్తించెదను. మీరు గూడ త్వరితముగ లక్ష్మణునిఁ గాంచుటకు రండు. స్త్రీల నిన నాతఁడు చాల తీక్ష్ణస్వభావము గలవాఁడని వింటిని! శీఘ్రముగ మీరు వచ్చి సమాధానపరుపకున్న నాతఁడు మఱింత కోపింపఁ గలఁడు సుఁడీ !

సుగ్రీ:-నేనింకను నాలసింతునా? తారా! (అంతనగరవైభవమును తిలకించి వచ్చిన లక్ష్మణుని తీవ్రధనుష్టంకార నాదములు వినబడుచుండ సుగ్రీవాంతఃపురప్రాంగణమునకువచ్చి నిలచుండిన యాతనిచే విడువఁబడిన కెంజుబాణములు కపిరాజు నంతఃపురముపై రివ్వురివ్వన శబ్దముతో నెగయును) తారా! తారా! సత్వరముగ నరుగుము! (రుద్ధకంఠస్వరముతో) ప్లక్షప్రభావులారా! మీరు గూడ ప్రచ్ఛన్నముగ నుండి యవసరమగు నెడ మా తారకు సాయమొనరింపుఁడు.

ప్లక్షప్రభా:-ప్రభూ! మేము గూడ నీదేవివెంటఁ జని శుకరూపముల నచ్చటి చూతవృక్షముల నాశ్రయించియుండి యవసరమగుచో తారకు తోడ్పడుదుము. స్త్రీయగుటచే నామెను లక్ష్మణుఁడు సరకుఁ గొనకపోవచ్చును!

సుగ్రీ:-ఔను! మీరు కామరూపులరు గాన నట్లొనరింపుడు. వేగముగ బోయి మెలకువతో వర్తింపుఁడు! (అంగదాంజనేయులొక ద్వారమునను, తారా ప్లక్షప్రభావులు వేఱొక ద్వారమునను నిష్క్రమింతురు. అంత సుగ్రీవుఁడు) రుమా! రుమా! కొంచెము మద్యము నిట్లు దెమ్ము! (రుమ మద్యము నందీయ సుగ్రీవుఁడు మరల త్రాగుచుండును.)

(తెరపడును.)

---

# చిత్రతారకము

## తృతీయాంకము

---

### ఒకటవరంగము

రసము:-రౌద్రము: వీరము: శాంతము: హాస్యము [చమత్కారము (Humour)]

పాత్రలు:-లక్ష్మణుఁడు, తార, ప్లక్షప్రభావులు.

రంగము:-(సుగ్రీవాంతఃపుర ప్రాంగణమున చూతవృక్షశ్రేణియొద్ద)

లక్ష్మ:-(అటునిటుఁదిరుగుచు- కోపమునభినయించుచు - ధనుష్టంకారమొనరించి) నేఁడీ యాగ్నేయాస్త్రప్రభావమున నీ సుగ్రీవాంతఃపురము భస్మీపటలమొనరించినంగాని యాతఁడీవల కూడివడునా? మూర్ఖుఁడగుకపిరాజు ధర్మమునుత్యజించి! యుద్ధమునువీడి! మిత్రులమోసగించి! పానపరతంత్రుఁడై యొడలుదెలియక మసలుచున్నాఁడు! (అనుచు సాటోపముతో నమ్ములపొదిపైఁ జేయివైచి బాణమును దీయఁబోవ నచ్చటి ద్వారపాలకు లటునిటుపాఱిపోవుచుందురు అంత తారాదేవి ప్రవేశించును)

తార:-(పైట జాఱుచుండ నొకవంక నొడ్డాణ మూడిపోవుచుండును. వేఱొకవంక హేమకటిసూత్రము వ్రేలుచుండ సవరించుకొనుచు, పానమత్తతచేఁదూలుచు కొప్పువీడి యందుండి విరులురాల - నమితాంగిరైయై - యందెలుఁగజ్జెలు మ్రోయ. లక్ష్మణునియెదుటకు వచ్చును).

ఉ॥ ఓమను జేంద్రపుత్ర! ఇటు - లొప్పని కోపముజూపఁగారణం
బేమియులేక మావయిని? - నెవ్వరు నీదగునాజ్ఞ సేయఁగా
నీమముదప్పినారలొకొ! - నీరసవృక్షము శంకదక్కి, తా
నేమముఁగోరువాఁడెవఁడు-నీరునొసెప్పుదవాగ్ని ముట్టినన్ ?

బిడ్డా! లక్ష్మణా? నీవె యిట్లాగ్రహింప నిన్నిఁక శాంతిం
పఁజేయువా రెవ్వరు?

లక్ష్మ:-(తిటాలునఁదలవంచుకొని కోపమువీడి తనలో)ఔరా!సుగ్రీవుఁడు
చాలయుక్తిపరుఁడు! నన్నూఱడించుటకే తారాదేవిని
బంపినుకాఁబోలు! కానిమ్మ! (ప్రకాశముగ) ఏమీ!
తారాదేవీ! నాకోపకారణము నీవేమియు నెఱుంగని
దానివలె నటించుచుంటివి.

తార:-నేనన్నియు నెఱుంగుదును ! నాకు భూతభవిష్యద్వర్త
మానములు కరతలామలకములని వాలి తనసోదరునితోఁ
జెప్పునప్పుడు నీవచ్చటనె యుంటివి కదా ! కాని నేఁటి
నీకోపకారణము మాత్రము నాకు దురూహ్యముగ
నున్నది! భూభారమును తలధరింప సమకట్టిన యుత్తమ
క్షత్రియునకు శాంత మత్యవసరము కాదా లక్ష్మణా ?

లక్ష్మ:-నేనీభూభారమును వహింప సమర్థుఁడను కాను. అందుకుఁ
దగినవారు మాయన్నయె.

తార:-ఔను! అతఁడీ త్రిభువనభారమును వహింప దక్షుడయ్యెను
నేఁడీభూభారమును హరించుటకు మాత్రమె యాతఁడు
బూనెననితోఁచు చున్నది !

లక్ష్మ:-మాయన్నను నీవట్లనుచుంటివేల! పరమశాంతులగు
వారి నట్లను టుచితమా ?

తార:-ఏలకాదు? నాభర్తయగు వాలిని విమర్శింపకయె, యతఁడు
జంపెను. నీవతనికిఁ దమ్ముఁడవగుటచేఁ గాఁబోలు వాలి
సోదరునిఁ జంపుటకు వచ్చితివి !

లక్ష్మ:-ఏమీ ! మాయన్న నీభర్తయగు వాలిని విమర్శింపకయె
చంపెనా ? వానరరాజ్య ప్రభువైయుండియు నాతఁ
డధర్మముగఁ బ్రవర్తించుటచే మాయన్న వానిని శిక్షిం
చిరి. సుగ్రీవుఁడుగూడ నట్లె ప్రవర్తింపుచో నేల దం
డ్యుఁడుగాఁడు ?

తార:-మిత్రుఁడు కొంచెము తప్పొనరించిన నంతమాత్రమున
నీవిట్లాగ్రహింపఁ దగునా దశరథనందనా?

లక్ష్మ:-(కోపముతో) కాలమును కర్తవ్యమును గుర్తింపకవర్తించు
నిర్భాగ్యుఁడు మిత్రుఁడైనను శత్రుఁడే!

తార:-ఇప్పుడు కాలము మించినదేమున్నది? మా సుగ్రీవుఁడు
కర్తవ్యమును మఱచెనని నీవెట్లు నిర్ణయించితివి?

లక్ష్మ:-అటులనా ? కార్యగౌరవమును బట్టి కాలగమనమును
ప్రభువులైన వారలు గమనింప వలదా ?

క॥ శరదాగమ సంరంభము
పరిసరములఁ బ్రకృతి యిట్లు-ప్రకటింపంగా
హరిరాజిటు సేవగలును
విరబోణులఁ దవిలి కాల-వేగముగనునే ?

సురాపానమత్తుఁడై కామతంత్ర నిమగ్నుఁడగు సుగ్రీవున
కెట్లు కార్యభారము దోఁచును ?

తార:- (సఖేలముగ)

క॥ నరవరతనయుఁడ ! మీఘన
గురువరుఁడగు కౌశికుండె-కూరిమి బెనఁగెన్
సురసతియగు మేనకతో
నురుకాలము తపము మఱచి - యుద్దేశమునన్ !

లక్ష్మణా ! అట్టి మహర్షులకె యెట్టిదిక్కును దోఁచక
మన్మథ తంత్రములందిట్టె తవులుకొని కాలకర్తవ్యముల
నట్టె మఱచిరి ! మాసుగ్రీవునట్టివానరుఁడెంత ?

లక్ష్మ:-(విసుకుకొనుచు) అబ్బా ! రామచంద్ర ! స్త్రీలతోఁ బురు
షులు చర్చించుట దుర్ఘటము. కేవలయుక్తి ప్రయుక్తు
లపై మీబుద్ధికుశలత జూపుదురు కాని, కార్యమును
సాధించు పరమార్థమును మీరరయరు కదా ! (అని
మెుగము చిట్లించుకొని తలవంచుకొనును).

తార:-బిడ్డా ! ఇటుచూడుము ! కార్యమును సాధించుటకు మా
సుగ్రీవసాహాయ్యము లేకున్న నీవెకాదు తుదకు నీయన్న
గూడ సీతయున్న జాడకనుంగొనఁ జాలఁడు !

లక్ష్మ:-(ఆశ్చర్యము నభినయించుచు) ఔరా ! స్త్రీలెట్టి దంభ వాక్య
ములనైనఁ బలుకుటకు వెనుదీయరు ! సుగ్రీవసాహా
య్యము లేకున్న మేము మాకార్యమును సాధింపఁ
జాలమా ? మారామచంద్రుఁడు బేలగావున తుదకతఁ
డిట్లు క్రోఁతుల నాశ్రయింపవలసి వచ్చెను !

తార:-రాముఁడు వేలయని నీవనినంత మాత్రమున నే నెట్లు నమ్మెదను? లక్ష్మణా!

ఈ (క్రోఁతులకొండముచ్చులను-గూర్చికరాక్షసకోట్లదునుంచి, తాఁ బీతిగ రాజ్యమేలఁదల-పెట్టిన రాముఁడు వేలయానె! యీ రీతిగ దేశమోక్షమొన-రింపఁగఁ జూచుమహాత్మునగాంచినక చేతులురెండుచేర్చి నుతి-సేయుచుమ్రొక్కరె యెల్లమానవుల్?

లక్ష్మ:-జనస్థాన మహాసంగ్రామమున పదునాలుగువేలఘోర రాక్షసుల నర్ధాధిక ముహూర్తమున మా రాఘవుఁ డొక్క-రుండె పోరిఁగొన్నవార్త నీకుఁ దెలియును కాఁబోలు! అట్టియతిప్రతాపి తదనుజునకు మీ పింగేశ సాహాయ్యమా కావలెను?

తార: ఓయీ! నీవు యువకుఁడవు! బంగరుపళ్లెమునకుఁగూడ నొకచిన్నమట్టిగోడ సాహాయ్యములేక యెదినిలచునా? రావణుని లంకాపట్టణము నీస్వదేశమగు జనస్థానమను కొనుచుంటివికాఁబోలు!

లక్ష్మ:-మా రామబాణాగ్నికి లంకాపట్టణము శుష్కేంధన ప్రాయము.

తార:-(సఖేలముగ) మాటలె యీలెలగునా? లక్ష్మణా! దుర్భేద్యమగు నా లంకాపట్టణము చతుస్సముద్రముద్రితమై యున్నది. అందు కోట్లకొలంది రాక్షసవీరులునిండి యున్నారు! మాసుగ్రీవాది వానరవీరుల సాహాయ్యము లేక వారినందఱఁ బోరిఁగొనుట మీ యిరువుర కసా

ధ్యము. రక్కసుల నిశ్శేష మొనరించినఁగాని మీకు సీత లభింపదు.

లక్ష్మ:-(శాంతించి) అటులనా! తారా! రావణునిగూర్చియు నాతని లంకాపట్టణమునుగూర్చియు నీకెట్లు తెలియును?

తార:-రావణునిగుఱించియు నాతని ప్రతాప మాయాబల సామర్థ్యాదులఁగూర్చియు నాకు మావాలియె పలు మారు చెప్పుచుండెడివాఁడు. అట్టికట్టడిరక్కసుని పట్ట ణమును ముట్టడించి పట్టుకొనుటకు మీకు మాసుగ్రీవ సాహాయ్య మావశ్యకమనిగూడ నాకాతఁడు సెప్పెను సౌమిత్రీ!

లక్ష్మ:-నీభర్తయైన వాలికిని రాక్షసప్రభు వైన రావణునకు నెట్టి సంబంధము? రావణునిగుట్టంతయు దెలియుటకు మీ వాలి లంకాపట్టణమునకుఁ బోవుచుండెనా?

తార:-మాకపిరాజును, నారాక్షసప్రభువును, నగ్నిసాక్షిక ముగ రామసుగ్రీవమైత్రికన్న నెక్కుడు సన్నిహిత సఖ్య మొనరించుకొనిరి. ఆసఖ్యానంతరము రావణుఁడు కిష్కిందయందు వాలి కతిథియై గొంతకాలముండెను.

లక్ష్మ:-రామ సుగ్రీవ మైత్రికన్న వాలి రావణమైత్రి మిన్న యనుటలో నీయభిప్రాయము నాకు సువ్యక్తమగుటలేదు, తారా!

తార:-వాలి రావణులు తమరాజ్యములను, ధనములను. భోజన భాజనములను, వేయేల? తుదకు తమభార్యలనుగూడ పరస్పరముఁ బంచుకొనుటకంగీకరించిరి!

లక్ష్మ:-(ముక్కు పై వ్రేలిడుకొని తనలో) కానిమ్మా పానమత్తురాలి నిఁక మనమీవిషయమునఁ బ్రశ్నింపఁ బాడికాదు (ప్రకాశముగ) సుగ్రీవసాహాయ్యము లేకున్న మేమిఁక లంకపై దండెత్తఁజాలనిచో కాంతామద్యములందుఁ దవులుకొన్న నీభర్తను దండింపకున్న నతఁడు తనకర్తవ్యమును గుర్తించునట్లు సేయుటెట్లు?

తార:-లక్ష్మణా! కొంచెము తప్పొనరించినంతమాత్రమున సుగ్రీవుని శిక్షించుటా! రఘువీరుల యౌదార్యమింతియేనా? (అనియుపహాసము చేయును)

ఉ. మిత్రుని నెవ్వగల్గడిపి-మేటిసుఖంబులఁగూర్చినట్టి యా క్షత్రియపుంగవు డకట!-కయ్యము సేయఁగఁ గాలుద్రవ్వుచో శత్రులునవ్వరే! యబల-సర్వమెఱింగిన నీకుఁజెప్పుటా! ధాత్రి నెవ్వరైననిఁక-దప్పులొనర్పరె సెప్పులక్ష్మణా!

లక్ష్మ:-అట్లనుటకు వలనుపడదు. ప్రభువులగువార లొకతప్పు చేసిన ప్రజలు పదియొనరింతురు. కాలక్రమమున లోకమంతయుఁ దప్పులకుప్పలందుఁ గూలును!

తార:-(తలపంకింపుచు) రామానుజా! మాటలెన్నియేనియుం జెప్పవచ్చును. ప్రభువగు శ్రీరాముఁడు మాత్రము ప్రమాదమొనరింపలేదా?

లక్ష్మ:-అట్లయిన నేనొప్పుకొనను. మాయన్న యెన్నండును నెట్టిదోష మొనరించియుండలేదు.

తార:-ఆతఁడు వాలిసుగ్రీవుల వైరకారణమును పూర్తిగ విమర్శించియె వాలిని వధించెనా? లక్ష్మణా!

లక్ష్మ:-వాలియొనరించిన కిల్బిషమును పూర్తిగ విమర్శించియె
మాయన్న యాతని దండించిరి. భ్రాతృభార్యాపహరణ
మొనరించి యామెను బలాత్కారముగ ననుభవించు
చుండిన దుర్మార్గునకు మరణదండనము శాస్త్రములు
విధించుచున్నవి. అందు మారామచంద్రుని దోషమేమి?

తార:-అట్లయిన వాలిచనిపోయెనని యెంచి సుగ్రీవుఁడుమాత్రము
నన్ను పరిగ్రహించి యుండలేదా? భ్రాతృభార్యను
గ్రహించిన సుగ్రీవునిమాత్రము దండింపవలదా?

లక్ష్మ:- తారా! నీవాక్యములె వాలియెడ సుగ్రీవుఁడు దోషి
కాఁడని ఋజువుచేయుచున్నవి.

తార:-అదెట్లు? లక్ష్మణా! నేను సుగ్రీవుఁడు దోషియనియె
చెప్పితినే!

లక్ష్మ:-నిన్ను సుగ్రీవుఁడు పరిగ్రహించెనా? లేక బలాత్కరిం
చెనా? నీవిప్పుడెట్లాతనిఁ జెందితివో యప్పుడుకూడ నట్లె
పొందియుంటివి. అందు సుగ్రీవుని దోషమేమి?

తార:-నాభర్త చనిపోవుట నాతఁడుచూచెనా? చూడకుండ
నన్నట్లతఁడు మోసముసేయుట తగునా?

లక్ష్మ:-తారా! తన యన్నకొఱకు సంవత్సరకాలముబిల
ద్వారమున సుగ్రీవుఁడు వేచియుండి తుదకు ప్రబల
మగుసిదర్శనములచే రాక్షసులవలన దనయన్న నిహతుఁ
డయ్యెనని యాతఁడు నిశ్చయించుకొనెను.

తార:-ప్రత్యక్షముగ తన సోదరమృతి నాతఁడు సూడనప్పుడు
తగినంతకాలము రాజ్యమును స్వీకరింపకుండ వేచియుం

డవలదా? ఆతఁడు రాజ్యమును చేకొనుటచే మా కుల
క్రమము ననుసరించి నేను నాతనిఁ జెందితిని.

లక్ష్మ:-రాజ్యమునందు ప్రభువులేనిచో నొక్కపూట కల్లకల్లోల
మగును. ప్రజలు కోరుటచే సుగ్రీవుఁడు సింహాసనము
నధిష్ఠింపవలసియుండెను. రాజ్యముకొఱకును నీకొఱ
కును సుగ్రీవుఁ డపేక్షించియుండినచో వాలి మరల
వచ్చినతోడనె పశ్చాత్తాపమునొంది యేల నిన్నును
రాజ్యమును నాతని కిచ్చివేయును?

తార:-వాలికన్న సుగ్రీవుఁడు దుర్బలుఁడు. అందుచే భయమంది
యిచ్చివేసెను.

లక్ష్మ:-అది నమ్మఁదగినమాటకాదు. సుగ్రీవుఁ డప్పుడు ప్రభు
వగుటచే నాతనియొద్ద పెద్దసైన్యము లుండెను. ఆంజనే
యాది కపివీరులెందఱో యుండిరి. సుగ్రీవుఁడు తన
యన్నకన్న ధర్మబద్ధ హృదయుఁడు కావుననె తన తప్పు
నొప్పుకొని నిన్నును రాజ్యమును మరల యన్నకిచ్చి
తనప్రమాదమును మన్నింపుమని వేడుకొనెను.

తార:-అదియేటిమాట ! ఎప్పుడు దుర్బలులె ధర్మము నాశ్రి
యింతురు. సుగ్రీవుని వాలివెడల నడచిన యనంతరము
గూడ నాతనియొద్ద నాంజనేయాదు లుండిరే ?

లక్ష్మ:-తారా ! నీవు పరస్పరవిరుద్ధముగ మాటలాడుచుంటివి !
సుగ్రీవుఁడు ధర్మబుద్ధికలవాఁ డగుటచేతనె యాతనివద్ద
నాంజనేయాది వీరులున్నను వారిసాహాయ్యము నపే
క్షింపక, భారతవర్షసార్వభౌముఁడు నిక్ష్వాకువంశప్రభు

పుడై సమస్తశాస్త్రపారంగతుఁడగు మా రామచంద్రు
నాశ్రయించి యతఁడు ధర్మవిజయమును సాధించెను.
ధర్మరతులగు బుద్ధిమంతులు మీ వాలివలె కేవలపశు
బలము నాశ్రయింపరు.

తార:- భరతుఁ డిక్ష్వాకువంశ సింహాసన మధిష్ఠించియుండ
రాముఁ డెట్లుప్రభువయ్యెను ? ప్రభువులుకదా శిక్షా
స్మృతుల ప్రవర్తింపఁజేయుట?

లక్ష్మ:- దేవీ ! మాతండ్రివాక్యము ననుసరించి పదునాలుగేండ్లు
మాత్రము భరతుఁ డయోధ్యనేలుటకును మాయన్న
యీయరణ్యభూముల నివసించు ప్రజలక్షేమమరయుట
కును చిత్రకూటమున మహర్షిపరిషన్ముఖమున నిర్ణ
యింపఁబడెను. అంతియకాక ధర్మసంరక్షణము ప్రతి
యుత్తమక్షత్రియునకును విధ్యుక్తము.

తార:- మా వాలిగూడ నొకదేశమునకు ప్రభువు. అతఁడు కపి
కులచక్రవర్తియని పిలువఁబడుచున్నాఁడు ! అట్టివానిని
జంపుటపాడియా ?

లక్ష్మ:- రాజన నెటులుండవలెనో నీవెఱుఁగవు తారా!

ఉ. రాజనువాఁడు జూడ దిన-రాజవిభూతిని ధర్మనిత్యమా।
తేజము రాజిలంగఁ దన-దీప్తకరాళిని, క్షుద్రనీరముల్।
ఓజనుబీల్చి యిక్షురస-మొక్కెడివారిగ మార్చునట్టులీ।
భూజనులందఱిం దయను-బ్రోచుచు దివ్యపథంబు గొల్పఁడే?॥

చ. పదుగురఁ బ్రోవుసేసి పరి-పాలనసేసెద నేనటంచుఁ బా
ముదమున భోగసంపదల-మున్గుచుఁ దేలుచుమూఢచిత్తుఁడై
మెదుకులు తిన్నకాకివలె-మేనులబెంచిన రాజులౌదు రే?
హృదయము ధర్మతత్పరత-నెప్పుడుఁ దప్పనివాఁడె రాజహో!

దేశద్రోహి, పితృద్రోహి, భాతృద్రోహి, స్త్రీద్రోహము లాచరించెడి మూర్ఖులు ప్రభువులా? తారా! అట్టి దుర్మార్గులగు పాలకు లుండిననేమి చచ్చిననేమి! (అని యాటోపముతో ననును.)

తార:-(అటునిటు జూచుచు) లక్ష్మణా! నీవుచెప్పెడివాక్యములు చాల నపూర్వములుగ నున్నవి! వాలి యట్టిద్రోహ చతుష్టయ మెట్లొనర్చెను?

లక్ష్మ:-(తీవ్రముగ) అంతియుకాదు! మారామచంద్రునకుఁ గూడ నీభర్త దారుణద్రోహ మొనరింప సమకట్టెను! త్రిలోకసుందరియు పరమపతివ్రతయునగు సీతను హరించిన దుర్మార్గుఁడగు రావణునకు మీవాలి తోడ్పడనెంచెను!

తార:-(మరల దిశలపరికించుచు) అన్యాయమన్యాయము! (చేతులు రెండుచేర్చి భయమునభినయించుచు) నీసోదరుఁ డొనరించిన వధను సమర్థించుట కిట్టిద్రోహపంచకము మావాలిపైఁ ద్రోయనెంచితివేకాని లక్ష్మణా! యాతఁ డట్టిఘాతుకముల నొనరించు రాక్షసుఁడు గాఁడు.

లక్ష్మ:—(కోపముతో బిగ్గఱగా) ఏమీ! మారాముని సమర్థించుటకు నేనిట్లనుచుంటినా? నీవు కేవలమభినివేశముగల యాఁడుదానివగుటచే ప్రభుధర్మమునుగూర్చి నేఁజెప్పి

నంటిమాత్రమున నీకుఁ దెలియదు ! దురాత్ములతో స్నేహమొనర్చువారుగూడ దురాత్ములే ! నీతోడ వృధాప్రసంగము సేయుటకు నేనిచ్చటకు వచ్చియుండ లేదు !

(లక్ష్మణుఁడు తారాదేవితో నట్లనుచుండుటయు సుగ్రీవుఁ డింకను రాకుండుటయు తార యటునిటు నిస్పృహతో దిశలఁ బఱికించుటయుఁ గాంచి, యిఁక తారావాక్యముల కాతఁడు సమాధాన మొసఁగడనియెంచి ప్లక్షప్రభావు లిరువురు ప్రవేశింతురు)

ప్రభా:-రామానుజా ! మా తారాదేవితో మీరెద్దియొ తీవ్రముగఁ జర్చించుచున్నారు !

లక్ష్మ-ఔను ! మా రామచంద్రుఁడు వాలి నక్రమముగ వధించె నని యాతనిపై నిందమోపుటచే నేనామెకు సమాధాన మొసంగుచుంటిని. క్లిష్టములగు రాజధర్మములు స్త్రీల కెట్లు తెలియఁగలవు ప్రభావా !

ప్లక్షుఁడు:-మీవంటి యుత్తమ క్షత్రియుల వలన నాధర్మ సూక్ష్మము తెలియంగఁగోరియె మా తారాదేవి మిమ్మట్లు ప్రశ్నింప దొరకొని యుండును లక్ష్మణా !

లక్ష్మ:-దుర్మార్గుఁడగు రావణునితోఁ బొత్తుగొని వాలి పెక్కువిధముల ధర్మవిప్లవము లాచరించుట, లోకమెఱుంగదా? కబంధుఁడు మాకు సుగ్రీవుని భార్య నక్రమముగ వాలి హరించెనని జెప్పెను. శబరిగూడ మాకు వాలి వర్తనము గూర్చి తెలిపి యుండెను. వాలి దుర్నయము జగద్విదితము. పాపములు దాఁగునా ?

తార:-లక్ష్మణా ! సాటి ప్రభువుతో స్నేహమొనరించినంత మాత్రమున నయ్యది ధర్మద్రోహమా ? రావణుఁడొక దేశమునకు ప్రభువుకదా ?

లక్ష్మ:- వాలి వానరుఁడు. రావణుఁడు రాక్షసుఁడు. వానరులకు సహజముగ శత్రువగు రాక్షసుఁడు సాటి ప్రభు వెట్లగును. రావణుఁడు దారలను గూడ పంచుకొను నంతటి స్నేహము వాలితో నూఁజక చేసెనందువా ?

తార:-మావాలి మిగుల బలవంతుఁడగుటచే రావణుఁడాతనితో స్నేహము నపేక్షించెను.

లక్ష్మ:-నేనంత మాత్రమున నీయభిప్రాయమును విశ్వసింపను. బలవంతుఁడగు వానరునితో స్త్రీలను గూడ పంచుకొను నంతటి మైత్రి యొనరించుటకు మాయావియగు నారక్కసున కెద్దియొ కుటిల వ్యాజముండి తీరును !

తార:-ప్రభుత్వమొనరించు వారికిఁ గామము కూడ నొక వ్యసన మబ్బును కదా ! లక్ష్మణా !

ప్రభా:-రావణుఁడీ భరతఖండమునందు తన రాక్షసరాజ్యమును నెలకొలుప దలంచి కామాతురుఁడగు వాలితో మైత్రిఁ గొని యాతనికి తాను హరించిన స్త్రీల నెరగాఁ జూపి యుండ నోపు స్వామిత్రీ ! రావణ వాలి స్నేహముల రహస్యమదియై యుండును.

లక్ష్మ:-ఔను ! పరదేశ ప్రభువగు రావణుఁడు కిష్కింధ ప్రక్క నున్న జనస్థానము నాక్రమించి, యందలి ప్రజలను నాశనమొనరించెను. బిలబిలలాడుచు సార్థకనామముగల

యీజనస్థానము నొక యరణ్యముగ నొనరించి యందు ఖరదూషణత్రిశిరఃప్రభృతులగు తన సోదరులను దగు సైన్యములతో ప్రతిష్ఠించి శూర్పణఖ యను నొక గూఢచారిణిని గూడ నందుంచెను.

ప్లక్షు:- ఈభరతఖండమును తా నాక్రమించుచో బలవంతుఁడగు వాలి తనకడ్డుతగులునని రావణుఁ డూహించియుండును. లక్ష్మణా!

లక్ష్మ:- ఈ దేశము నాక్రమించుటయకాదు ప్లక్షా! మనమహాత్తరార్ష విజ్ఞానమును నాశమొనర్చి భారతజాతిని యున్మూలించినఁగాని తన రాక్షసప్రభుత్వము శాశ్వతముగ నుండఁజాలదని, యీ దేశమునుండి యుత్తమ జాతిస్త్రీలను రావణుఁ డెత్తుకొనిపోయి వారిని జెరచుచుండెను! విజ్ఞానసంపదకును జాతిసౌష్ఠవమునకును స్త్రీ పవిత్రత ప్రధానము.

ప్రభా:- అట్లనా! లక్ష్మణా! ఆహా దేశక్షేమమునకును ప్రజాసౌభాగ్యమునకును స్త్రీ పాతివ్రత్యము ముఖ్యమని మా వానరులకుఁ దెలియదు రామానుజా! దుర్మార్గుఁడగు రావణుఁ డీ యార్యావర్త స్త్రీల నందఱినో చెఱగొనిపోయెను. అక్కటా!

తార:- కానిండు! భారతవర్ష మొకఖండము వంటిదికదా! ఇందనేక భాషలును, వివిధమతములును, పలుజాతులు గూడ నివసింపవచ్చును. రావణుఁడుగూడ కొంత దేశము నాక్రమించిన నేమి?

లక్ష్మ:- అట్టి సీయూహా రావణుఁడు నీభర్తకుపదేశించిన రాజకీయపుటెత్తు! బుద్ధిహీనుఁడగుటచే మీవాలి రావణుని వలలోఁ దవులుకొని యుత్తరభారతమనియు, దక్షిణభారతమనియు రెండు భిన్నదేశములుగ నూహించెను. ఈ భరతఖండము కన్యాకుమారి మొదలు హిమవన్నగము వఱకు నిక్ష్వాకువంశస్థులది. ఇచ్చట నార్షవిజ్ఞానమును వేద మతమునుమాత్రమె యాచరింపఁబడవలెను.

తార:- ఇందుఁ బెక్కురాష్ట్రములు, వివిధభాషలు గూడ కలవుకదా!

లక్ష్మ:- భాషయనునది విజ్ఞానవ్యాప్తికొఱకీశ్వరప్రేరితమగు నొక దివ్యసాధనము. పరిపాలనాసౌకర్యమునకై రాష్ట్రములు వివిధము లుండవచ్చును. కాని భారతీయులనందఱ నొకే విజ్ఞానసూత్రమున బంధించునది యార్షసంస్కృతి. వేదమతమె యా దివ్యసంస్కృతికి మూలము.

తార:- రావణుఁడుగూడ వేదమును పూర్తిగ నెఱింగినవాఁడం దురుకదా! ఆతఁడు వేదమతమునకుఁ జెందియుండలేదా లక్ష్మణా!

లక్ష్మ:- అట్టియాతని దుష్పాండిత్యమే లోకమునకు మఱింతకంటక హేతువగుచున్నది! అతఁడు తొల్లియార్షసంతతికిఁజెందిన బ్రాహ్మణుఁడయ్యును రాక్షసుఁడుగ మారెను!

ప్లక్షు:- రావణుఁ డామతమును స్వీకరించుటచేకాఁబోలు నాతఁడు విరాధఖరాదులకన్న నెక్కుడుపద్రవమాచరించు చుండెను ! లక్ష్మణా !

లక్ష్మ:-విరాధఖరాదులు జన్మచేతనే రాక్షసులు. రావణుఁడు వృత్తిచే రాక్షసుఁడు ప్లక్షా !

పరిభా:-ఔరా ! జన్మచేఁబుట్టిన రాక్షసులకన్న వృత్తిచే రాక్షసులైనవార లెక్కుడు విప్లవమునకు కారకులౌదురా ? లక్ష్మణా !

లక్ష్మ:-ఏలకాదు? కామాంధుఁడైనవాలి యింద్రపుత్రుఁడైయుండియు నాదుష్టరాక్షసునితోఁ జేరి సోదరభార్యను హరించెను ! రావణుఁడుగూడ నట్టిదుర్నీతికి గడంగినట్లు కాన్పింపదు! అంతియకాక, నీభారతవర్షమునకుఁ గుక్షియనందగు జనస్థానము నా వరరాజాక్రమించుచుండ నూరకుండెను !

తార:-అట్లయిన విభిన్నమతములవారొకే దేశము నేలుట కనువు కాదందువా? లక్ష్మణా !

లక్ష్మ:-విరుద్ధమతములవారికి విభిన్నసంస్కృతు లుండకతప్పదు. వారొకరి నొకరాక్రమింపఁదలంతురు. మతమును, సంస్కృతియు, బరస్పరాధారాధేయములు.

తార:-విభిన్నసంస్కృతు లున్నంతమాత్రమున నేల సంఘర్షణములు కలుగవలెను?

లక్ష్మ:-ఆర్షమతమునం దీసృష్టియంతయు నీశ్వరాధీనమగుటచే, నొకరి కాంతాకనకములు మఱియొక రాశింపరాదని వారియాశయము. ఇఁక రాక్షసులీప్రకృతియంతయు దమభోగములకే యమరియున్నదికావున, నితరమానవుల స్త్రీధనములను బలాత్కారముగ తామనుభవింప

వచ్చునను మతముకలవారు. ఈయిరువుర కెట్లుసరి పడును? అందునను వారొక్కచో పరిపాలింప గడంగు నెడ సంఘర్షణము లెట్లుతప్పును?

ప్లక్షు:-ఔను! రామానుజా! గోదావరీ కృష్ణవేణీ ప్రవాహా సిక్తపుణ్యభూమియగు జనస్థానమునందు దేవ, గంధర్వ, విద్యాధర, యక్ష, ఋష్యాదికాంతలు పెక్కుజాతు లుండెడివారనియు నట్టి యుత్తమస్త్రీలను రావణుఁ డెత్తుకొనిపోవుచుండెడివాఁడనియు మాపెద్దలు చెప్పు చుండిరి. ఆనారీమణులిప్పుడు కేవల శిల్పములందు మాత్రమే మనకుఁ గాన్పింతురు లక్ష్మణా!

లక్ష్మ:-ప్లక్షా! రావణుఁడంతటితోఁ దృప్తిఁజెందుటలేదు! ఇటు జనస్థానమునుండి యెచ్చటనో గంగకావల నున్న తాటకావనపర్యంతము దేశమును కొల్లగొట్టుచు, స్త్రీధనముల నెత్తుకొనిపోవుచుండెను! అట్టి దుష్టరాక్ష సునితోఁ బొత్తుగొనియున్న వాలి దేశద్రోహ స్త్రీ ద్రోహముల నాచరించెననఁ దప్పేమి? రావణుఁడెత్తు కొనివచ్చినయట్టి యనదలను తానుగూడ బంచుకొను టకుసిద్ధమై వానితో మైత్రియొనరించెనే!

ప్రభా:-ఔను దేశభక్తియు స్త్రీగౌరవమును పాటించువారెవ్వ రు నట్టి పరదార చౌర్యమొనరించుతుంటరులతో మైత్రిఁ గొనరు. వాలి యట్టి శత్రురాజునకుఁ జేయూతనొసం గుట దేశద్రోహమె.

తార:-సౌమిత్రీ! మావాలి పితృద్రోహము నాచరించెనంటివి కాదా?

లక్ష్మ:-స్త్రీవ్యసనమునందుఁ దవులుకొనిన దుర్బుద్ధు లెట్టిఘాతుకములైనఁ జేతురు. అట్టివెడగులకు తల్లిదండ్రులుగాని భ్రాతృమిత్రులుగాని కానవత్తురా? వాలితండ్రి యింద్రుఁడుకాదా దేవీ!

తార:- ఔ నాతఁడు ఋక్షరజక్షేత్రమున నింద్రాంశమున జన్మించెనందురు.

లక్ష్మ:-తనతండ్రియైన నింద్రునిఁ జావఁగొట్టి రథఘోటకమునకుఁ గట్టితెచ్చి లంకయందు కారాగారమున రావణుఁడు బంధించెనను వార్త నీవెఱుఁగవు కాఁబోలు! ఆరీతి పితృపరాభవమొనరించిన దుర్మార్గునితో మైత్రిసేయుట యేకాక, యతని దనకతిథిగఁ జేసికొనుట కేమందువు?

సుగ్రీ:-లక్ష్మణా! అయ్యది పితృద్రోహమె! పాపము! వాలికింద్రుఁడొక యద్భుతశక్తిగల దివ్యమాలనుగూడ నిచ్చెను! దానిప్రభావమున నాతఁడెట్టిశత్రువునైన నవలీలగ జయింపఁగలుగుచుండెను.

లక్ష్మ:-ఔను! రావణపుత్రుఁడు తనను జయింపఁ దన పుత్రుఁడు రావణుని జయింపవలెనను నాసతో వాలికింద్రుఁడా మాల నిచ్చెను.

ప్రభా:-ఔను! తండ్రిబన్నమును కుమారుఁడు వాపుట సహజము కదా! తన తండ్రిని పరాభవించిన శంబరుని

శ్రీరాముఁడు వధించెను. పితృపరాభవమువో గొట్టుట పుత్రునకు విధి.

లక్ష్మ:- తండ్రి పరాభవమును పోఁగొట్టుటకు మారు వాలి యామాలను నీచకామమున కుపయోగింప నెంచి రావణునితో సహాకరింప సమకట్టెను ! అది యేమందువు తారా !

తార:-పోనిండు ! అయ్యది తండ్రి కుమారుల తగవు. వాలి రాముని కొనరించిన యుపకృతి యేమి ?

లక్ష్మ:-తారా ! మా శ్రీరాముని భార్యను దన మిత్రుఁడగు రావణుఁడెత్తుకొని పోయెనని వాలికిఁ దెలియునందువా? లేదందువా ?

తార:-ఆవార్త వాలికెట్లు తెలియును ! ఆతని కెవ్వరు సెప్పిరి ? రామసుగ్రీవులు సఖ్యమొనరించుకొని రనియె నాకంగ దుఁడుచెప్పెను. నేనావృత్తాంతమున వాలి కెఱింగించితిని.

లక్ష్మ:-తారా! నీవు దాఁచినంత మాత్రమున లోకము గ్రహింపఁ జాలదందువా ? రావణుఁ డొనరించిన సీతాపహారణ దుర్నయ మంతయు వాలికిఁ బూర్తిగ తెలియునని నీమాటలవల్లనె తెల్లమయ్యెను !

తార:-అదెట్లు లక్ష్మణా? నీకు నేనట్లు చెప్పియుంటినా ? నీవుచాల వింతగ మాటాడుచుంటివి!

లక్ష్మ:-ఇందాక సుగ్రీవసాహాయ్యము లేక మేము లంక పైదండెత్త జాలమని వాలియె నీకుఁ బలుమారు సెప్పెనంటివే!

మేము లంకపై విడియుట కేమికారణము కాఁగలదని యూతఁ డూహించెనందువు?

తార:-లక్ష్మణా! ప్రభువు లొకరిపైనొకరు పెక్కుకారణములచే నెత్తుదురు! అట్టి పరోక్షవాదమును గైకొని నీయట్టి నయజ్ఞుఁడు వాలి దోషియని నిశ్చయించు టుచితమా?

లక్ష్మ:-పోనిమ్ము! తారా! మారామచంద్రునిబాణముచే మరణ వేదననొందుచుఁ గూడ "రామా! నీవు సుగ్రీవు నాశ్రయింపక నన్నాశ్రయించియుంటివేని సీత నొక్కపూట కుఁ దెచ్చియిచ్చెడివాఁడ"నని వాలి యేలదంభములు పలికెను? సీతను రావణుఁడు దొంగిలించెననియు నామెను దెచ్చుకొనుటకే మేము సుగ్రీవునితో మైత్రిఁ గొంటిమనియు మీవాలి కెవ్వరు సెప్పిరి?

తార:-ఓహో! రామచంద్రునితో వాలి యట్లనినట్లు నాకుఁ దెలియదు లక్ష్మణా!

ప్రీ.భా:-తారా! నీకుఁ దెలియునంతమాత్రమున సీతాపహరణ వృత్తాంతము వాలికిఁ దెలియదని నీవెట్టులనగలవు? అగ్ని సాక్షికముగ వాలి రావణులు స్నేహమొనరించుకొను టచే తాను దొంగిలించిన స్త్రీలను తనమిత్రునకుఁ జెప్ప కుండ రావణుఁ డెట్లుండగలఁడు?

సుగ్రీ:-(తనలో) అక్కటా! ఇంతవఱకు మాకపిరాజు జాడయే లేదుకదా! కానిమ్ము! ఇఁక నెట్లైన నీలక్ష్మణునితో మఱి కొంతకాలము ముచ్చటించుచుండిన సుగ్రీవుఁ డింతలో స్నానాదు లాచరించి యలంకరించుకొని రాగలఁడు

(ప్రకాశముగ) లక్ష్మణా ! వాలివాక్యములు దంభములు
కాపునుఁడీ! అతఁడు రావణునికన్న మిగులబలవంతుఁడు
గావున నట్లనెను.

లక్ష్మ:-ప్లక్షా! అయ్యది వట్టిభ్రమ. వాలి తన మాలాప్రభావ
ముచే ద్వంద్వయుద్ధమునం దెట్టివారినైనఁ గొట్టఁగలిగి
యుండవచ్చును. కాని చాటుననుండి బాణముచేఁ గొట్టి
నంగాని, పదుగురు చుట్టుముట్టి చంపినంగాని యాతఁ
డేమియు సేయఁజాలఁడని మారాఘవుఁడెఋజువుచేసిరి.

ప్రభా:-వెనుకనుండి రావణుఁడు గొట్టవచ్చియు నతఁడు వాలికి
చేజిక్కెనే! లక్ష్మణా !

లక్ష్మ:-ప్రభావా! యుద్ధసూక్ష్మములు మీకుఁ దెలియవు. రావ
ణుఁడు ప్రబల మాయావిశారదుఁడు. కుటిలరాజ్యతంత్ర
జ్ఞుఁడు. అతఁడు వాలిబలమును పరీక్షించుటకుమాత్రమె
వెనుకనుండి యాతని గొట్టవచ్చెను. వాలిని జంపిన
రావణున కేమిలాభము? అట్టి బలవంతుఁడగు స్త్రీలో
లుఁడు దనకు మిత్రుఁడైనచో తన దుర్మార్గత కతఁడు
సాయమొనరింపఁగలఁడని యారక్కసుని యుక్తి!

ప్లక్షు:-ఔను! దుర్మార్గులగు యుక్తిపరులు తమమాయాబల
మునకుఁదోడుగ పశుబలము నపేక్షింతురు. లేకున్న
వాలినిజంప నిజమగువైరము రావణునకున్నచోఁ దన
దివ్యాస్త్రబలముచే వానిని వెనుకనుండిగొట్టక నూరక
వెనుకనుండి పైఁబడనెంచునా? అదియుఁగాక నట్లు

చంపవచ్చుటయె నిజమగునేని వాలితో రావణుఁడేల
వెంటనె చెలిమిచేయును?

ప్రభా:—అంతియకాదు ప్లక్షా! వాలినివధింప రావణుఁడు
తలపెట్టినచో నింద్రునంతటివానిని జావగొట్టిన యింద్ర
జిత్తు వాలిని పరిమారించి వధింపకుండునా?

ప్లక్షు:—కాని, పదుగురు చుట్టుముట్టిన వాలి తట్టుకొనఁజాలఁ
డనుటకు నిదర్శనముకానరాదు! లక్ష్మణా!

లక్ష్మ:—అయ్యది వాలియె ఋజువుచేసికొనెను ప్లక్షా!

ప్రభా:—అదెట్లు లక్ష్మణా! మీరుచెప్పునది చాలనబ్బురముగా
నున్నది!

లక్ష్మ:— ఇందు వింతయేమున్నది? వాలి మాయావియను
రాక్షసుని దఱుముకొనిపోయికదా గుహనుఁజొచ్చెను?

ప్రభా:—ఔనౌను!

లక్ష్మ:—అతఁడు గుహనుప్రవేశించునప్పుడు దాని ముఖమున
సుగ్రీవునేలఁ గాపుంచెను? ఎందులకుంచెను? ముందు
వెనుకల దనసడ్డగించినను వాలియొక్కఁడె యనేకరాక్ష
సులతోఁ బోరఁగలిగియున్నచో నాతనికింక సుగ్రీవ
సాహాయ్య మేల కావలసియుండెను? సుగ్రీవు నింటికి
పొమ్మనియుండును.

ప్లక్షు:—నిజమే! తన్నెవరైన వెనుకనుండి గొట్టవత్తురను
భయ మాతనికి లేకుండిన వాలికండయై సుగ్రీవుఁ డుండ
నేల? ప్రభావా!

లక్ష్మ:—కావున ననేకకోట్ల రాక్షసులతో నిండియున్న లంక వాలి చొచ్చుటెక్కడ ? రావణునితో యుద్ధమొనరించి సీతను దెచ్చుటెక్కడ? లోకపరిత్రాణముకొరకు వాలి యట్టి ప్రగల్భములు చనిపోవునప్పుడు పలికెను.

తార:—కానిమ్ము ! లక్ష్మణా ! పరిభృత్యము సేయుచు ననేక వానరబలముల కధినేతయగు వాలినివీడి ఋష్యమూక మున డాఁగియున్న సుగ్రీవునాశ్రయించుటలో శ్రీరాముఁ డేటి కార్యవాది ?

లక్ష్మ:—తనకు ప్రబలశత్రువైన రావణునకు పరమమిత్రుఁడును, భ్రాతృభార్యాపహరణమొనరించినట్టియు వాలిని మా రాముఁ డాశ్రయించినచో లోకమేమందురు తారా ! నిరతిశయ ధర్మమూర్తియగు మా రాముఁడు కాముకుఁడై భార్యకొఱకు భ్రాతృద్రోహ పితృద్రోహ ములాచరించిన వాలి నాశ్రయించెననరా ? అట్టి దుర్మార్గు నాశ్రయించుటకు మారాముఁడంత చేతకాని వాఁడు కాఁడు !

పరిభా:—అంతియకాదు దేవీ ! రాముఁడు సుగ్రీవుని జేకొను టలో నొకధర్మసూక్ష్మముగూడ గలదు ! అతఁడొక వంక దేశద్రోహ ధర్మద్రోహము లొనరించుచుండెడి దుర్మార్గుల శిక్షించుటయు, దీనుఁడగు సుగ్రీవుని గాపాడుటయుఁ దన భార్యను దెచ్చుకొనుటయునను మూఁడు మహత్తరపురుషార్థముల రాముఁడు సాధింప నెంచెను !

సుగ్రీ:—తారా! రాముఁ డుత్తమక్షత్రియ ధర్మములను పూర్తిగ గుర్తించిన విద్వాంసుఁడు.

ఉ. ధర్మము నర్థకామములు - తార్కొనుచోటుల నెల్లవేళలం
గర్మలనాచరింప నటు - కామము నర్థము నెట్టివైచి, తా
ధర్మమునాది కార్యముల - తత్పరుఁడై యొనరించుఁగాన,నీ
మర్మము గాంచిరేని భువి - మానవులన్నిట వృద్ధిగాంచరే!

తార:—ఆరీతిగ వాలిని శిక్షింపదొరకొన్న శ్రీరాముఁడు తానొనరింపఁదలంచిన దండమును దోషియగు వాలికిఁ దెలియఁబలుకవలదా? అటులొనరించుటకూడ ధర్మము కదా?

లక్ష్మ:—దివ్యమాలా బలగర్వమును, రావణస్నేహ గర్వమును కలిగి యభేద్యమైన నిట్టిదుర్గమునందుఁ డాగియుండిన మత్తునియొద్దకు మా రాముఁ డేఁగి "నీవిట్టితప్పుచేసితివి గాన నిన్నుదండింతు"నని చెప్పమందువా? సమయము వచ్చినపుడు మాపైఁబడుటకుఁ దనిమిత్రునితో కుట్రలు సలుపుచుండిన వాలికడకు మేముపోవుట యేటినీతి? చాలు! చాలు! నదియా కార్యవేదిలక్షణము? సుగ్రీవునొద్దకుమాత్రము మేముపోయి యాశ్రయించితిమా? అతఁడె మావద్ద కాంజనేయునిబంపి మాసఖ్యమును ముందుగఁ గోరెను. అటుతరువాత మేమతనితో మైత్రియొనరించితిమి.

తార:— రామచంద్రుఁడట్లు తెలిపియుండినచో మావాలి యొకవేళ పశ్చాత్తాపమునొంది యాప్రభునితో సఖ్య

మొనరించుకొని యుండునేమోయని యట్లంటిని రామానుజా !

లక్ష్మ:— మేము పంపాసరోవర ప్రాంతారణ్యముల వైశాఖ పూర్ణిమ మొదలు నెలదినములు పైఁగ నుంటిమి. ఆవిష యము మాతఁ డెఱింగియు నట్టి పశ్చాత్తాపము నొంది యుండలేదు ! పరదేశప్రభువగు రావణున కాతఁ డాతి థ్యమిచ్చెనుగాని స్వదేశప్రభువగు శ్రీరాము నాతఁడు బలుకరింపనైన లేదు !

తార:—ఋష్యమూక ప్రాంతారణ్యములకు వాలిగాని, వాలి పక్షీయులుగాని పోవుటకు వీలు లేదు.

లక్ష్మ:—అట్లైన సుగ్రీవునితో మేము సఖ్యమొనరించుకొనిన వార్త యంగదున కెటుల దెలిసెను ? మధ్యస్థులగు జాంబవదాదులు కిష్కింధయం దుండిరికదా ? అట్టి వారి నేల మాకడ కంపరాదు ? ఒకవంక రావణుని వేగులవాండ్రు మమ్ము ప్రతిక్షణము గనిపెట్టుచుండిరి ! వారు వాలితో మా వృత్తాంతము సెప్పకుండ నెట్లుం డఁగలరు ?

తార:—వారు వాలికి మీవృత్తాంతము జెప్పినట్లు నాకుఁ దెలి యదు ! వాలి యచ్చటికి వచ్చుటకు వీలు లేక నూర కుండెనేమోయని నే ననుకొనుచున్నాను. స్త్రీలకు మీ పురుషుల రహస్యములన్నియుఁ జెప్పెదురా ?

ప్రభా:—ఔను ! అందునను వ్యభిచారులగు పురుషు లసలె చెప్పరు ! (అని మందహాసము చేయును)

లక్ష్మ:-పోనిమ్ము! రాముఁడు సుగ్రీవునకు సాయమై వచ్చి వెనుకనుండెనని నీవాతనికిఁజెప్పితివనియంటివే! కిష్కింధ సమీపమునకు మాయన్న వచ్చియున్నఁగూడ వాలి యాతనిఁ లెక్కగొనెనా?

తార:- శ్రీరాముఁడు తనను జెట్టుచాటుననుండిఁ గొట్టునని యాతఁడూహింపలేదు!

లక్ష్మ:-ఇఁక సుగ్రీవు నెట్లైనఁజంప డీకొన్న వాలిని రాముఁడూరక పోనిచ్చుచు, సుగ్రీవునిఁజంపనిచ్చుననుకొనెనా?

తార:-మావాలి సుగ్రీవునిఁజంప డీకొనలేదు. ఆతని మర్దించి "దర్ప"మడంచుటకుమాత్రమే వాని యుద్దేశమని నాకుఁ జెప్పెను.

లక్ష్మ:-అది వట్టిబూటకము. నిన్నూఱడించుట కట్టి యుపచార వాక్యములను వాలి పలికెను. "దర్ప"మడంచుట యన్న నర్థమేమి? ఎట్టులైన మారామునకు సుగ్రీవుఁడు సాయమొనరింపకుండ నొక మాంసపిండమువలె నాతని జేయుట వాలి యాశయము కాఁబోలు!

ప్లక్షు:-ఔను! అట్లొనరించినచోఁ దన మిత్రుఁడగు రావణునకు వాలి పూర్తిగ సాయమొనరించినవాఁడు కాఁగలఁడు! తారా! వికలాంగుఁడై దర్పమడంగిన సుగ్రీవుఁ డింక రామున కెట్లుపకరింపఁగలఁడు?

ప్రభా:-అందుచే నిఁక రాముఁడు సీతాన్వేషణమును లంకా దండయాత్రయు వీడి వెనుకకుఁ బోవలసివచ్చును. అంత

నితరస్త్రీలవలెనే సీతనుగూడ దన మిత్రునితోఁ బంచు కొనవచ్చునని వాలి యూహించెననుట తెల్లమగు చున్నది! తారా! అది శ్రీరామునకు ద్రోహముసేయ దలంచుటకాదా?

లక్ష్మ:-అట్టి దురూహయె వాలికి లేకుండిన మా రాముఁడు వానిని బిలిపించి మందలింపవలెనని యత్నించినను వాలి యెంతమాత్రము గలసిరాలేదు. తన క్షేమమును గోరిన స్వదేశప్రభువునకన్న దుర్మార్గుఁడగు విదేశప్రభువె తన కాప్తుఁడని యా కామాంధుఁడు నిశ్చయించుకొనెను.

తార:-రాముఁడు వాలిని మందలింప దలంచెనా లక్ష్మణా! నీవాదము చాల నపూర్వముగ నున్నది! నాకా విష యమె తెలియదు రామానుజా!

లక్ష్మ:-రాముడు సుగ్రీవుని కిష్కింధకు ముందుగనంపి యా వెనుక దానుండి వాలిని బిలువుమనిరి. కాని సుగ్రీవు నెట్లైన జంపి తన మిత్రునకుఁ బ్రియమాచరింప సమకట్టిన వాలి తనను బిలిచినంతనె సుగ్రీవునిపైఁబడి మర్దింపసాగెను.

తార:-ఔను! రాముఁడు వెనుకనుండెనని వాలి యెట్లెఱుంగును?

లక్ష్మ:-తెలియకున్నంతమాత్రమున సోదరుని జంపవచ్చునా? తనకన్న బలవంతు లీసృష్టియం దుండరా? సోదరుని స్త్రీధనముల నెంతకాలమాతఁ డాక్రమింప నెంచెను? సోదరునిఁ జంపినచో నిఁక తగవుతీఱునని యాతఁడనుకొనెను!

ప్లత్లు:—ఒకవంక తనస్నేహితున కుపకారము వేఱొకవంక శాశ్వ
తముగ సోదర దారధనముల నాక్రమించుట. ఈ
రెండులాభములు వాలి పొందదలంచియుండునులక్ష్మణా!

తార:—అయ్యది వాలితప్పె లక్ష్మణా !

లక్ష్మ:—ఇఁక రెండవమాఱు పుష్పమాలాలంకృతుఁడై సుగ్రీవుఁడు
వచ్చినప్పుడైన మాయన్న వెనుకనుండెనని వాలి గ్రహిం
పలేదందువా? అప్పుడు నీవుగూడ నతని వారించి యుంటి
వని యంటివి కాదా !

తార:—అట్లయిన ప్రత్యక్షముగ నెదుటికి వచ్చి రాముఁడేల
వాలిని గొట్టగూడదు ? చాటుననుండి కొట్టుట యేటి
ధర్మము ?

లక్ష్మ:—అందులకు శ్రీరాముఁడె తగు సమాధానము వాలి
కొసంగెను.

తార:—అదియొక సమాధానమా? రామానుజా ! వాలి పశువు
గావున రాముఁడు చెట్టుచాటుననుండి గొట్టెనఁట! వాలి
పశువా ? ఆతఁడు వానరరాజ్యప్రభువు కదా !

లక్ష్మ:—వాలి పశువని మారాముఁడు ముందుగ ననలేదు. తా
నొనరించిన ద్రోహములను గప్పిపుచ్చుకొనుటకై తా
నమాయకుఁడగు పశువని వాలియె యనెను. ధర్మమును
గూర్చి మహోపన్యాసమొనరించిన వాలి పశువెట్లగును?

తార:—వేఱొక్కనితోఁ బెనంగునప్పుడు కొట్టుట యేటిధర్మము?
అట్టి యధర్మయుద్ధము రాముని యట్టి నిశితధర్మప్రవర్త
కుఁడు సేయవచ్చునా లక్ష్మణా!

లక్ష్మ:-తారా! నీవిప్పుడీక యుద్ధధర్మములఁగూర్చి ప్రసంగించుచుంటివి! మా రామచంద్రుఁడు వాలిపై యుద్ధమును ప్రకటించెనా ?

తార:-లేదు.

లక్ష్మ:-అట్టి యుద్ధధర్మము లెట్లు ప్రవర్తిల్లును ? పెక్కుదేశ విప్లవము లాచరించుచుండిన శత్రురాజులతో మైత్రిఁ గొని ధర్మద్రోహము లాచరించెడి ఘాతుకుఁడు వాలి. అతఁడొక యద్భుతశక్తిగల దివ్యమాలను కలిగియుండి దానివలన మఱింతగర్వించి యుండెను. అట్టి దుర్మార్గులగు విద్రోహులఁబట్టి వధించుటకు ప్రభువు లనేక యుక్తులఁ బన్నుచుందురు. అయ్యెడ యుద్ధధర్మములతో నేమాత్రమును బ్రసక్తి లేదు. తారా !

ప్రభా:-ఔను ! దేవీ! ప్రభువులు ముందుగ స్వదేశమునం దుండెడి శత్రుపక్షపాతులగు విద్రోహుల నణంచకుండ పరదేశమందలి శత్రులపై నెత్తుటెట్లు ?

లక్ష్మ:-సంఘవిప్లవ మొనరింప నెంచిన పరశురాముని యట్టిబ్రాహ్మణతపస్వినె పూర్తిగఁ బరాభవించి పంపినరాముఁడు దేశద్రోహాది ఘోరపాతకము లొనరించి శత్రునకు సాయపడ సమకట్టిన వానరుని శిక్షింప కూరక పోనిచ్చునా ?

ప్లక్షు:- ఔను ! దేశమునందలి దుర్మార్గుల శిక్షింపకున్న నీక ప్రభువులు ధర్మమును ప్రతిష్ఠించి శాంతమును రాజ్యమునందు నెలకొల్పుటెట్లు? దేశమునుకొల్లగొట్టి స్త్రీల నపహరించెడి రాక్షసుల నిర్మూలింపసమకట్టి న

రాముఁ డందుచేతనె ముందుగ తన దేశమును బాధ సేయుచున్న రాక్షసులనందఱిఁ బొరిగొని భారతవర్ష మును నిష్కంటక మొనరించెను తారా!

లక్ష్మ:- స్త్రీ పాతివ్రత్యధర్మమును గాపాడుటకై మా సీతయార్త నాదము వినినంతనె పక్షియగు జటాయువుగూడ తన శరీరమర్పించెనే! తన సోదరభార్యను బలాత్కరించి యాక్రమించెడి తుంటరి యితరుల భార్యలను మన్నిం చునా? తనరాజ్యముమీఁదుగ ననేకసాధ్వీమణులఁ దన మిత్రుఁడెత్తుకొనిపోవుచుండ తానువారించుటకు సమర్థుఁ డైయుండియు నూరకుండెను! మాకుఁ దనసోదరుఁడు సాయమొనరింపసమకట్ట నాతని జంప డీకొనెను! అట్టి దుష్టాత్ముని శిక్షింప నుపేక్షించినచో ధర్మమును లోక మునందుఁ బ్రతిష్ఠింపగడంగిన మా రాముని ప్రయత్నము వ్యర్థముకదా! తారా!

తార:- ఔను! లక్ష్మణా! శ్రీరాముఁడు వాలినేల సంహరింపఁ దొరకొనెనో నాకిప్పుడు పూర్తిగనర్థమైనది. నిన్నిట్లు ప్రశ్నించినందులకు మన్నింపుము.

లక్ష్మ:-(తనలో) ఔరా! ఇంకను సుగ్రీవుఁడు రాకుండెనే! ఇఁక నేమిగతి! (ప్రకాశముగ) రామానుజా! మఱి వాలిసుగ్రీ వులు తొలుదొల్తతలపడినయెడల రాముఁడు వాలినిఁ గొట్ట కూరకుండెనే! అప్పుడె సుగ్రీవుఁడు చచ్చియుండిన నిఁక నాతనికి సాయమెవ్వరొనరించెడివారు? రామునకు మిత్రద్రోహపాతకముగూడ నంటియుండెడిదికదా!

లక్ష్మ:- ప్లక్షా ! అందు మా రాముని దోషమేమియు లేదు.
సుగ్రీవునకుఁ దనయన్నతోఁగలిగిన వైర కారణమును
సత్యముగ జెప్పుమని మాయన్న సుగ్రీవు నడిగిరి.

ప్రిభా:- అతఁడంతయు జెప్పెనఁటకదా !

లక్ష్మ:- అంతయుఁ జెప్పెను. కాని తన యన్న బిలమందుండిన
కాలమున సీతార నాతఁడు గైకొనెనను విషయమును
గప్పిపుచ్చెను ! అట్లసత్యమాడిన సుగ్రీవుఁడు చచ్చిన
మాయన్నకేమి కిల్బిషము ! సీత నెట్లైయినఁ దిరిగి
సంపాదించుకొనుటయె మా రాముని ప్రిధానోద్దేశ
మైనచో నాతఁడు వాలినే యాశ్రియించియుండెడి
వాఁడు! కేవలధర్మప్రతిష్ఠాపనమునకై సర్వస్వమాహుతిగ
నొడ్డదలంచిన రామునకు భార్యనుత్యజించు టొక లెక్కా!

ప్లక్షు:- తారను సుగ్రీవుఁడు చేకొనెననువిషయము మీకెట్లు
తెలిసెను?

లక్ష్మ:- వాలి సుగ్రీవు లిరువురు దలపడినతఱి వారి పరస్పర
"వ్యాభాషణ"ములవల్ల తెల్లమయ్యెను.

ప్రిభా:- ఇఁక రెండవమాఱు సుగ్రీవుని రాముఁడేలఁబంపెను?
పుష్పమాల నలంకరించికూడ నంపెనే !

లక్ష్మ:- ఔను ! అప్పటికైన వాలి పశ్చాత్తాపముజెంది
రామునివద్దకువచ్చి తనతప్పు నొప్పుకొనునను యూహ
తో రెండవమాఱు మరల వాలిని బిలువనంపిరి. సుగ్రీ
వునకుఁగూడ తనయసత్యమునకుఁ బ్రాయశ్చిత్తమయ్యె
నని మా రాముఁ డాతని మన్నించిరి అట్లిరువురకుఁ

కూడ మా రామచంద్రుఁడు మఱియొక సదవకాశ మొసంగిరి కాని వాలి యెట్టిపశ్చాత్తాపమునొందలేదు

ప్లక్షు:-పశ్చాత్తాపము నొందలేదు సరిగదా పైఁగ తన సోదరుని మరలఁ జంప డీకొనెను !

లక్ష్మ:-అప్పుడు తప్పక రాముఁడు వాలిని గొట్టవలసివచ్చెను

ప్రిభా:—వాలిసుగ్రీవుల తారతమ్యము తనకుఁ దెలియకపోవుటచే రాముఁ డప్పుడు కొట్టియుండలేదని యాతఁ డనె నందురు ! ఇందేది నిజము? రాముఁ డట్లుబద్ధమాడెనా?

లక్ష్మ:-మారాముఁ డెన్నఁడు రెండుమాట లాడువాఁడుకాఁడు ప్రిభావా ! ఇంద్రదత్తమాలాప్రభావము చేఁగూడ నా తనికిఁ గొంత నేత్రవిభ్రాంతి కలిగెను. దానివలన నిరువుర భేదము నాతఁడు గ్రహింపకుండ నేత్రములకు మిరుమిట్లు కలిగెను. ఆ నేత్రపీడనము తొలఁగుటకే మేము రెండవమాఱు కిష్కింధకు వచ్చునప్పుడు సప్తఋషుల్యా శ్రమమునుమీదుగ వచ్చియుంటిమి. ఆయాశ్రమము దర్శించి ఋషులకు నమస్కరించినవెంటనే మా రామునకు విభ్రాంతి తొలఁగెను ?

ప్రిభా:- సుగ్రీవునకా రెండువిషయములఁజెప్పక యొక్క నేత్రవిభ్రాంతినె రాముఁడు చెప్పుటకుఁ గతమేమి?

లక్ష్మ:- మా రామచంద్రుఁడు చాల మొగమాటముగల మెత్తని హృదయముగలవాఁడు. అదివఱకె తన యసత్యమునకు సిగ్గుజెందుచుండిన తనమిత్రుని హృదయము

నింకను నొప్పించుట కిష్టములేక రెండుకారణములందు నొక్క-దానినే వివరించెను.

ప్లక్షు:-ఆహా ! రామచంద్రుఁ డెంత యుదారస్వభావుఁడు ! వాలి గూడ పశ్చాత్తాపమునొంది సుగ్రీవుని యాతఁడు మరల చేకొనియుండెనేని రాముఁ డెంతయానంద మొంది యుండును !

ప్రభా:-రెండవమాఱు వాలి సుగ్రీవులు తలబడినప్పుడు గూడ వాలిమెడయందు స్వర్ణమాల యుండెనే! అప్పుడు రాముఁడు విభ్రాంతిఁజెంద లేదంటువా ? లక్ష్మణా!

లక్ష్మ:-అప్పుడు సుగ్రీవునిమాత్రమె లక్షించి శబ్దవేధిచే వాలిని గొట్టిరి. అట్లు సుగ్రీవుని గుర్తించుటకు వానిమెడయం దుండిన పుష్పమాల జాలియుండెను.

తార:-కానిమ్ము! లక్ష్మణా ! మావాలి శ్రీరామునిచే శిక్షింపఁబడి మరణకాలమునందైన నతఁడు పశ్చాత్తాపము నొందుటచే తన పాపములఁ బాసి సద్గతికిఁ బోయెను.

లక్ష్మ:-దేవీ ! త్రిలోకప్రభువగు నింద్రునకు బుత్రుఁడై తన శరీర బల బుద్ధిబలముల లోకక్షేమమునకును ధర్మరక్షణము నకు నుపయోగింపక తన జీవితమునంతయు నట్లు పశు వృత్తియందు వ్యర్థమొనరించెఁగదా యని మా యన్న యాతని యాతనను జూచి కంటఁ దడిపెట్టిరి ! గతించిన దానికై యిఁక వగవఁబనియేమి ?

ప్లక్షు : ప్రభా:-సౌమిత్రీ ! మీరిట్లు వాలివధా వృత్తాంతమును దానియందలి ధర్మసూక్ష్మములను నిర్ధరించుటఁజేసి

రామకార్యార్థమై వెడలనున్న మా కపివీరుల సందేహ ములు పూర్తిగ తొలంగఁగలవు. అందు ముఖ్యముగ నంగదుఁడు తన తల్లివల్ల సర్వము నెఱుంగఁగలఁడు. యువరాజగుటచే నాతని సాహాయ్యముకూడ మా కావశ్యకముకదా !

లక్ష్మ:-అమాత్యవరులారా ! తర్కమునకుఁ దావుకలదు కాని కుతర్కములకు సమాధాన మొసంగుట యసంభవము. లోకమునందు మూర్ఖులింకను మా రాముఁడు వాలి నక్రమముగ గొట్టెనని వాదించువా రుందురుగాక, అంతమాత్రమునఁ బరమార్థమున కేమిభంగము ? తా నధర్మము నొనరించితినని వాలియె పశ్చాత్తాపము నొంది సద్గతికిఁబోవఁ గొంద ఱాతని స్థానము నిట నాక్రమింప దలంచి యట్టి దుష్ప్రచారమునకు లోనగు టలో నాశ్చర్యములేదు! "లోకోభిన్నరుచిః" కదా !

తార:-సౌమిత్రీ ! సుగ్రీవుఁడు ధర్మబద్ధహృదయుఁడని నీవొప్పు కొంటివి. ఇప్పుడింతలో నతఁడధర్మము సేసెనా ?

లక్ష్మ:-ఒకప్పుడు ధర్మమునందుఁ బ్రవర్తించువారు సైతము కాలవశమున వ్యసనములం బతితులై ధర్మచ్యుతినొందు దురు. పానాసక్తుఁడై సుగ్రీవుఁడు తన ప్రధానప్రభుధర్మ మగు సత్యముసె వీడెను! అట్టి చపలునికొఱకు మేమెంత కాలమింక నిరీక్షించి యుందుము ? (అని యాటోపముతో నను.)

తార:-బిడ్డా ! త్వరపడకుము. మాకీపాడు మద్యమును మీా మానవులె ముందుగ గనిపెట్టి తెచ్చిపెట్టిరి ! వారినుం డియె మాకీదుర్వ్యసనము సంక్రమించినది ! ఏమిసేయు దుము. పురుషులు తమ కామభోగములకై మాకుఁ గూడ నీయసభ్యవ్యసనము నబ్బఁజేసిరి !

లక్ష్మ:-నాకు మీావ్యసనముతోఁ బనిలేదు! సుగ్రీవుఁడు త్వరలో రాకున్న నప్పుడు నా ధనుఃఖడ్గములకుఁ బని సెప్పవలసి వచ్చును! (అని ధనువును సెలపైఁదట్టుచు ఖడ్గమును సవరించును)

తార:-లక్ష్మణా ! కోపింపకుము ! నీవెట్టులైన నిప్పట్టునఁ గార్య మును సాధించుకొని మాపట్టణమునుండి పోవలెనుగాని ఖడ్గము నెత్తు టుచితమా ? (తనలో) అక్కటా ? మా సుగ్రీవుఁడు రుమాదేవితో సరసములాడుచు నంతఃపుర మును వీడఁజాలకున్నాఁడు కాఁబోలు ! ఇఁక నెట్లైన నీకోపగాని నచ్చటికిఁ గొంపోయినంగాని యాపానాలసు నకు వివేకమబ్బదు ! (ప్రకాశముగ) లక్ష్మణా ! నీకొక్క చక్కని యుపాయము జెప్పెదను. దానివలన నిరపాయ ముగ నీవు రామకార్యమును సులభముగ సాధింపఁ గలవు !

లక్ష్మ:- (ఆశ్చర్యముతో) దేవీ ! ఆయుపాయమేమి ! త్వరగ జెప్పుము చూచెదను !

తార:-నీవు మాసుగ్రీవాంతపురమున కరుదెంచిన మీామిత్రు నితోఁ దగుమాటలాడి నీకార్యమును జక్కబెట్టుకొని

సుఖముగ బోవచ్చును ! సౌమిత్రీ ! నాలుగడుగులలో మనమచ్చటికిఁ బోగలము !

ప్లక్ష ప్రభా:- ఔనౌను! లక్ష్మణా! మా తారావాక్యములు తప్పక సమాదరణీయములు!

లక్ష్మ:- (కోపముతో) ఏమిా! మాట నిలుకడ లేని యాకాముక కపి మూర్ఖుని నేఁబోయి దర్శించుటా! నా బాణమె యా తనిం గాంచుఁగాక! (అని యమ్ములపొదినుండి బాణమునుదీసి సంధానోద్యుక్తుఁడగుచుండ)

తార:- (హస్తము నడ్డుపెట్టి) ఆగు మాగుము! రామానుజా! మా సుగ్రీవుఁడు మాటనిలుకడలేని మూర్ఖుఁడుగాఁడు. నీవా తనిం జంపినచో నిఁక సీతను వెదకువా రెవ్వరు నుండరు. అతఁడీ భూమినంతయుఁ బలుమా ఱుచుట్టివచ్చిన భూగో ళవేది. అట్టిసమర్థుఁడగు కపిరాజును తెగటార్చి లక్ష్మ ణుఁడు కార్యమునంతయుఁ జెఱచె ననువాదు తుదకు నీ నెత్తిపైఁబడును! నీవు సీతను ఘోరారణ్యమున నొం టరిగ దిగవిడిచి పోయితివని నీయన్న యీావరకె "యలో లక్ష్మణా!" యని యడలుచున్నాఁడు !

చ. నినుగనుఱెప్పరీతిఁగని - నిద్దురవేళల మేల్కొనంగ నే ననిశముగాతునంచు మును- నాడవె లక్ష్మణ! యన్నతోడ నా ఘనుఁడగు రామమాటనటు - కాదనిసీతనువీడి, నేఁడిటుల్ జనునొకో! తామసేంచి కపి-సత్తముజంప శరంబుదీయుటల్!

లక్ష్మ:- (మరల శాంతించి) దేవీ! అట్లయిన నీఁక సుగ్రీవునె, నే, బోయి చూడవలెనందువా! (అని ధనువును డించి, యిషువును మరల నిషంగమునం దుంచును)

తార:- సౌమిత్రీ! కపిసైన్యములన్నియు నీవఱకె మాసుగ్రీవుఁడాయత్తముచేసెను. నీవొక్కసారి యాతనిఁగలుసుకొన్నచో నన్నియు నిముషములో తెలియఁగలవు. ఆలసింపనేల? నావెంటరమ్మా.

లక్ష్మ:- అట్లనా! దేవీ! సుగ్రీవుఁడు సైన్యముల సిద్ధపఱచెనా?

ప్లక్షప్రభా:- లక్ష్మణా! మా తారాదేవి శ్రీరామునియందు మిగుల భక్తిగలది మా సుగ్రీవుఁడుగూడ రామకార్యమును మఱచియుండలేదు. ఆతఁడు సైన్యముల సిద్ధము చేసినమాట నిక్కము. ఇఁక నొక్కవిశేషముగూడ గలదు! వాలి చనిపోవుటకు ముందు తన దివ్యమాలను తనసోదరున కిచ్చెను. దానిప్రభావమున మా కపిరాజు మీరు రాక్షసులతోఁ బోరునప్పుడు సాయపడుటకు సమర్థుఁడునుఁడీ!

లక్ష్మ:- (ఆలోచించి) కాని! ... దేవీ! ... నేనింతవఱకెవ్వరి యభ్యంతరములఁ జొచ్చియుండలేదు నేను మీ సుగ్రీవాంతఃపురమున కెట్లు వత్తును?

తార:- ఆతఁడు మాసుగ్రీవుఁడె కాఁడు లక్ష్మణా! మీసుగ్రీవుఁడుగూడసుమీ! మీరు సూర్యవంశజాలు. అతఁడు సూర్యపుత్రుఁడు. ఇట్టిసన్నిహితస్త్రీబాంధవ్యముగల బంధువుల గృహముల కేఁగునప్పుడు [illegible]లగవడినంత

మాత్రమున నీకు ప్రతిభంగమగునా ? బిడ్డా! నావెంట రమ్ము ! ఇట్టి చేదస్త్రములఁబెట్టుకొనకుము !

లక్ష్మః:- (నిట్టూర్పుతో) అట్లయినఁగానిమ్ము ! దేవి ! నీవు ముందుగ నడువుము ? నీవెనుక నేనువత్తును.

తార:-అదీ ! రాజనీతి ! నేనుచెప్పినచొప్పున నీవు నడచుచో నీకు విజయము తప్పదు లక్ష్మణా ! నీవు బొత్తుగ పిన్న వాఁడవు. పైఁగ నీ వయఃకాలమున నగ మరణ్యముల యందె గడపుటచే నీకు లోకానుభవముచాలదు ! కుమారా ! ఇటురమ్ము ! ఇటురమ్ము ! (అని తారముందు నడచుచుండ లక్ష్మణుఁడు ధనుష్పాణియై వెనుకఁబోవును.)

ప్లక్షప్రభా:-రామానుజా ! మాకు సెలవొసగుఁడు. మాతారా దేవి యాశీర్వచన ప్రభావమున మీకుఁ త్వరలో విజయము సేకుఱుఁగాక ! (ప్లక్షప్రభావులు నిష్క్రమింతురు)

(తెరపడును)



# చిత్రతారకము

## తృతీయాంకము

---

### రెండవ రంగము

రసము:—రౌద్రము, భయానకము, వీరము, శాంతము, హాస్యము

పాత్రలు:—సుగ్రీవుఁడు, రుమ, తార, లక్ష్మణుఁడు, అజముఖి, పరిచారికలు.

రంగము:—కిష్కింధ, సుగ్రీవుని యంతఃపురము.

[సుగ్రీవుఁడు రుమాదేవిని తన ప్రక్కను కూర్చుండఁబెట్టుకొని హంస తూలికాతల్పాసీనుఁడైయుండ అజముఖి స్వర్ణపాత్రముతో మద్యము దెచ్చి రుమ కందించును, రుమ సుగ్రీవున కిచ్చును. సుగ్రీవుఁడు త్రాఁగుచుండ]

తార:—(ముందునడుచుచు, సుగ్రీవుఁ డింకను త్రాఁగుచుండుట గాంచి వెనుకకుఁ దిరిగి లక్ష్మణునితో) లక్ష్మణా! మాసుగ్రీవమహారాజడుగో! నీవాతనిని సందర్శించి, వచ్చినకార్యమును నివేదింపుము. మీరిరువురు ముచ్చటించుచుండ నే నిప్పుడ వచ్చెదను. (అని లక్ష్మణుని ముందునకుఁ బంపి ప్రక్క తెరలోనికి తార వెడలిపోవును.)

లక్ష్మ:—(ధనుష్పాణియై సుగ్రీవునెదుటికి భూమియదరునట్లు నడచుచు బోవును.)

సుగ్రీ:-(లక్ష్మణుని జూచి యదరిపడి చేతనున్న పానపాత్రను జారవిడువ నందున్న మద్యము పొర్లిపడును. అంత సుగ్రీవుఁడు నివ్వెరపాటుతోఁ గన్నులు విచ్చి తెల్లబోయి వెఱ్ఱిచూపులు చూచుచుండ, క్రోధారుణిత విస్ఫారిత నేత్రముతో తీక్ష్ణముగ లక్ష్మణుఁడు సుగ్రీవుని జూచును. అంత సుగ్రీవుఁడు భయముతో వణకుచు) రుమా! రుమా! (అని రుద్ధకంఠస్వరముతో రుమను గాఢముగ కౌఁగలించుకొని) తారా! తారా!...ఉండు!...ఉండు!...ల!ల! లక్ష్మణుఁడు!...(రుమ కంగారుతో భర్త కౌఁగలిని వదలించుకొన యత్నించుచుండ, సుగ్రీవుఁడు మఱింత గాఢముగ కౌఁగలించుకొని) ఉండు!...ఉండు!...తారా!...తారా! (అని వెఱ్ఱిగ, రుద్ధకంఠముతో ననుచుండ)

లక్ష్మ:-(కోపముతోఁ బండ్లు పటపటకొఱుకుచు జేవురించిన నేత్రములతో) ఏమీ! సుగ్రీవా! నీవింకను నీ ప్రపంచమువైపు నీ దృష్టిని మరలింపలేదా? (అని గర్జించుచు) ఔరా!

శా. ఏరీతిన్ మనసొగ్గి నీవు నకటా! యీతుచ్ఛభోగంబులం
దారింగానక పానమత్తత నిసీ! దావాగ్ని కీటంబవై!
నారీవిభ్రమసంభ్రమంబుననిటుల్ న్యాయంబుఁబోఁద్రోచి మా
శ్రీరాము న్మది విస్మరించితివి! నీ క్షేమంబు గుర్తింపకే!

సుగ్రీ:-లేదు!...లేదు?...ల...ల...లక్ష్మణా!...లక్ష్మణా! వచ్చుచున్నాను...వచ్చుచున్నాను. (అని శయ్యనుండి దిగఁబోవుచుఁ దూలుచుండ రుమ తల్పమునుండి డిగ్గనఁలేచి పారిపోవును. అజముఖి పానపాత్రను విడిచి పారిపోవును.)

తార:-(అంత తారప్రవేశించి సుగ్రీవునిబట్టుకొని మెల్లగదింపుచుండ నావెం సావేశ్యమున సుగ్రీవుఁడెట్టకేలకు మంచమునుండి దిగి మంచము నానుకొని నిలువఁబడ, తార యుత్తరీయమును, గిరీటమును సవరించుచుండ)

లక్ష్మ:-(ఆటోపముతో ధనువును నేలపైఁదట్టుచు) కటకటా ! సుగ్రీవా! ఎంత కృతఘ్నుఁడవైతివి !

క. హేమాద్రివంటి రాముఁడు
భామామణిఁ గోలుపోయి పర్వతశిఖలన్
కామార్తి మిగులపొగులుచు
నీమాటలనమ్మి యకట ! నికృతుండయ్యెన్ !

(తీవ్రముగ ధనుష్టంకారము సేయుచు)

గీ. చచ్చెనొక్కఁడె వాలి దా మచ్చరించి
సత్యదూరుండవగు దేని సర్వబంధు
యుతముగాఁగను గూలెద వుద్ధురంపు
బాణనిహతిని పింగేశ త్రాణలుడుగ !

గీ. రామబాణాగ్నిశిఖలచేఁ గ్రాఁగకీవు
ప్రతిన నెరవేర్చి మానంబు ప్రాణములను
గాచుకొనఁజూడు సుగ్రీవ కాలమెఱిఁగి
భ్రాతృమార్గంబు బట్టక బ్రతుకుమయ్య !

సుగ్రీ:-(భయముచే వెఱ్ఱిచూపులఁజూచుచు నోటమాటరాక తొట్రుపాటుతో)
ల...ల...లక్ష్మణా ! వలదు ! క్షమింపుము...వచ్చుచున్నాను !...వచ్చుచున్నాను !

తార:-లక్ష్మణా! లక్ష్మణా! శాంతింపుము! శాంతింపుము! మాసుగ్రీవుఁడు శిక్షార్హుఁడు గాఁడు. శ్రీరాము నాతఁడు విస్మరింపలేదు. అతఁ డసత్యమాడువాఁడును కాఁడు. కోపము వలదు! కోపము వలదు!

లక్ష్మ:-(సంరంభముతో) చీటికి! మాటికి! భర్తలను వెనుక వేసుకొని వచ్చుట స్త్రీలకుఁ బరిపాటి! మీరొకవంక నభేద్య శృంఖలములై వారిని గామపాశంబుల బంధింతురు! వేఱొకవంక మీనిశితవచన శరవాలములతో వారి కుత్తుక లుత్తరింతురు! మిమ్మునమ్ముట కెంతమాత్రమును వీలులేదు! సుగ్రీవుఁడు సైన్యములన్నియు సిద్ధముచేసి యుంచెనని నమ్మించి నన్నీయంతఃపురమునకుఁ గొనివచ్చితివి? నీభర్త యిట్లుండ నెక్కడిసైన్యములు? ఎక్కడి లోకము? ఇదంతయు పెద్దమోసమువలె నున్నది! (అని బిగ్గఱగ కేకలు వేయుచుండ నాసంరంభమంతయుఁ గాంచి, పరిచారికలు, స్త్రీలు నటునిటు పారిపోవుచుందురు.)

తార:-(చిఱునగవు మోమునఁదోఁప) సౌమిత్రీ! స్త్రీపురుషుల కవినాభావసంబంధము! భర్తలను వెనుకవేసికొని వచ్చుటయె స్త్రీధర్మము కాదు! నీయట్టిదుడుకు బిడ్డలను శాంతింపఁజేయుట గూడ మాకు నెత్తిరాత! (నవ్వుచు) రఘుపుంగవా! నీవువట్టియమాయకుడవు! సైన్యము లంతఃపురమున నుండునా! అవి మాపురమంతయు నిండియున్నవి! నీవీపురప్రవేశ మొనరించు నప్పుడు నిన్నడ్డ

గించిన వారు మా సైనికులె ! శాంతింపుము ! శాంతింపుము !

లక్ష్మ:- ఇట్టి నీభర్తను జూచి నన్నింకను శాంతింపు మందువా ? నేనిఁక నూరకోనను ! (అని ధనువునెత్తి టంకారము సేయుచు భూమి యదరునట్లు నటునిటు నడుచుచుండ, పరిచారకులు భయముతో కిలకిలలాడుచు పాఱిపోవుదురు.)

సుగ్రీ:- (గడగడ వణకుచు) ల...ల...లక్ష్మణా !...లక్ష్మణా ! ఇదిగో!...ఇదిగో!

తార:- బిడ్డా, లక్ష్మణా ! తొందరపడకుము ! మా సుగ్రీవుఁడు మీకు శత్రువు కాఁడు! ఇటుసూడుము! నీకోపమునకు కలంగి నీమిత్రుని యంతఃపురస్త్రీలు పాఱిపోవుచున్నారు !

ఉ॥ ఓరిమి సేయుచో శుభము లొప్పఁగ చేకుఱు నెందుజూచినన్
కూరిమిసొంపు పెంపుగను గొప్పగ జెల్లును మానవత్వ మీ
ధారుణి సర్వభూతములు తత్పరతన్మల గంగఁజాలు నా
సైరణచువ్వో భూషణము ! సత్యము లక్ష్మణ వీరకోటికిన్ !.

లక్ష్మ:- ఔనౌను ! ఎవ్వ రెట్టి యపచార మొనరించిన మా రామచంద్రుని శాంతమె యాతనిఁ జుల్కనగఁ జూచుటకు హేతువగుచున్నది ! మా రామచంద్రుని మిత్రుఁడిట్టి త్రాఁగుఁబోతనిన మాకిఁక నెట్టిగౌరవము లోకమునం దుండును ?

తార:- సుమిత్రానందనా ! ప్రేమయనిన నీ వేమియు నెఱుఁగవు! నీవు కేవల మహంకారస్వరూపుఁడవు! ఈసృష్టియందలి

కష్టములనుండి దాఁటించి సుఖములనుమాత్రమె తన యాశ్రితులకిచ్చు చిత్రతారకుఁడు రాముఁడు! అట్టి కరుణామయునకు నీవెట్టిసోదరుఁడవైతివో నాకు బోధపడుట లేదు! ఇట్టికోపికిఁ గార్యములెట్లు గట్టెక్కగలవు?

లక్ష్మ:-ఆహా! నీభర్తలనుపోలు మిత్రులున్నచో మా కార్యములగతి వేఱుగ నడుగవలెనా? మారాముని ప్రేమతత్వమె యాతని కిన్నిపాటులదెచ్చెను!

తార:-లక్ష్మణా! ఈవిచిత్రప్రపంచము బహురీతుల రూపొందుచుండును! ప్రేమరసార్ద్రభూత తితిక్షాబీజముల నీ హృదయమునఁ బాదుకొల్పినంగాని నీ యహంకృతి వలననె తుదకు నీవు నీయన్ననుగూడ వీడవలసినవాఁడవగుదువు సుమీ!

లక్ష్మ:-నీవ్రగల్భవచనములకేమిలెమ్ము! తన కన్నతల్లికన్నమిన్నగ గైకను ప్రేమించి రాముఁ డడవిపాలయ్యెను! తనతోఁటి సోదరునివలె నీసుగ్రీవునిఁజేపట్టి తుదకు భార్యనుగూడఁ గోల్పోవుదుస్థితికివచ్చెను! ఎచ్చటప్రేమ! ఎచ్చటలోకము! ఇట్టివారు బంధువులా!

తార:-లక్ష్మణా! కైకమాత్రము పండ్రెండుసంవత్సరములు తన కన్నకుమారుని మఱచి రాముని బెంచలేదా! కాలవశమునఁ గలిగిన రాజ్యవిచ్ఛేదమున కా యమను దూఱెదవేల?

ఉ॥ చీకులుచింతలుం గలుగఁ జేడ్పడనోర్చినఁగాని మానవుల్
చేకొననేర్తురొక్కొ-చిరజీవితకీర్తుల? మాటిమాటికిన్
కైకనునీవుదిట్టెదవకారణయుక్తులఁ గాకిపెంపకే
కోకిలవాసిఁ గాంచునటె! కోమలపంచమనాద సంగతిన్!॥

సుగ్రీ:-(ఇంతలో తేలుకొని) రామానుజా! క్షమింపుము! క్షమింపుము! మిత్రులను పరిభవించుట మిత్రవంశజులకు పాడికాదు.

శా॥ ఢంకాపైచెయిదట్టి చెప్పెదనిదే! డంబంబులం బల్కనే
లంకాపట్టణమెల్లఁ జాపవలె నా లాంగూలముంజుట్టి ని
శ్శంకన్వేపెకలించి తెచ్చెదను మత్సంరంభగాంభీర్యముల్
బింకంబొప్పఁగ నీవెచూచెదు రణా భీలప్రదేశంబునన్

లక్ష్మ:-(వికటముగ హాసముసేయుచు) సుగ్రీవా! ఏమీ! నీ వీరాలాపము లంతఃపుర స్త్రీలయొద్దనా?

సుగ్రీ:-కాదు! కాదు! నాపరాక్రమ శక్తిసామర్థ్యములు మా తారాదేవి నీకు జెప్పియుండలేదా? రఘూత్తమా! నేటి నామాటల పాటవము రామరావణ రణరంగమునందుఁ గూడ నీవె చూచెదు సోదరా!

తార:-సుగ్రీవా! నేనన్నియు నీ సౌమిత్రితోఁ జెప్పితిని. కాని నే నాడుదాన నగుటచేఁ గాఁబోలు నన్ని చెప్పిన నీ రామానుజుఁడు నమ్ముటలేదు!

ఉ॥ సీతనుదెత్తునంచు నిటు సెప్పినయంతనె కార్యమౌనె? నీ
కోఁతల నెట్లునమ్మెదరు క్రోఁతులచేడ? పరాక్రమింపఁగా
చేతులసత్తువెల్ల నిటు స్త్రీపరిరంభణ లాలనంబులం
బ్రీతిగఁ జూపు నిన్నుగని పెద్దగరాఘవుఁ డాదరించునే?

సుగ్రీ:- తారాదేవి! నాప్రతాపపౌరుషములు నీవెఱింగియు నేఁ
డిట్లనుట మనలక్ష్మణపీతికొఱకు గావలెను! కానిమ్ము!

మ॥ అటులైనం గపిసేనగైకొని యిదే యానందమింపొంద, నీ
విటవృత్తిం దెగనాడి (అని పుష్పమాలలను తెంచి పాఱవైచి పాన
పాత్రను విసరివైచి) నాప్రతిసముల్ వెన్వెంట నేతేర్చెదన్
భటసంఘంబుల నెల్ల సీతవెదకన్ పంపించెదన్ వేగమే
చటులార్తింబడు రామువత్నిగననే సాధింతు చంద్రాననా!

(అని యావలకువచ్చి) తారా! నేసేఁక నాలసింపనేల?
శ్రీరామునిజూచుటకు వెంటనేపోవుదును.

తార:- నాథా! మీరట్లాచరించినఁగదా మిమ్మువీరలోక
మారాధించును! (అని లక్ష్మణుని జూపుచు) సుగ్రీవా!

శా. కాంతలు మద్యమాంసములు గల్గవెయెల్లెడ నిజ్జగంబునన్
జంతువులట్లు పండితుఁడు సంతతభోగవిలాస విభ్రమ
భ్రాంతినిజెంద కార్యముల భారముఁగోచునె? కాలమాఁగునే?
చెంతుఁడుమాత్రమే కనఁడె ధర్మము నర్థము కామమోక్ష
ముల్!

ఉ॥ భోగము లెల్ల వీడి వన భూముల చేడియనోడి ఋష్యమూ
కాగమునందు (గ్రుం)దివిర హాబ్ధితరింపఁగ నావపంచు, నీ
యాగమనంబెగోరు భవ దాప్తుని జేరి ఋణంబుదీర్పఁగా
వేగమపొమ్ము! మిత్రకుల వృద్ధినిగాంచుము మిత్రనందనా!

సుగ్రీ:- దేవీ! నేఁటి కా రామచంద్రుని కటాక్షమువలన నా
కర్తవ్యమును పూర్తిగ గుర్తించుభాగ్యము కలిగినది!
చిరవిరహాతప్తుఁడనై మా రఘువీరులయందలి చనవుచే
నేనిట్లు కాలాతిక్రమణ మొనరించినందులకు నామిత్రులు
క్షమింతురుగాక! నేఁడిదె ప్రతిజ్ఞను గైకొనుచుంటిని.
సర్వసాక్షియగు నాతండ్రియె నాకును సాక్షియగుఁగాక!

గీ॥ సీతఁగొనివచ్చి రాముతోఁ జేర్చుదాఁక
నేను కిష్కింధ రా నిదే పూనితాన
శేముషీస్ఫార చతురసుషేణపుత్రి!
రాజ్యభారంబు వహియింపు రమణి నీవ!॥

లక్ష్మణా! లెమ్ము. మనమిప్పుడ శ్రీరామసన్నిధికిఁ బోవు
దము. ఎవరచ్చట! సేవకా!

సేవకుఁడు(ప్రవేశించి) చిత్తముమహారాజా! దేవరయాజ్ఞయేమి?

సుగ్రీ:- నేనీలక్ష్మణ సోదరునితో రామచంద్రునికడ కేఁగుచుంటి
నని చెప్పి యంగదాంజనేయ నీలసుషేణులను ఋక్ష
పుంగవులైన జాంబవంతుని నన్ను ఋష్యమూకమున
తగు సేనలతో కలసికొనుమని చెప్పుము. నే నెక్కెడి
పల్లకినిగూడ వెంటనే యాయత్తపరపింపుము.

సేవ:- చిత్తముప్రభూ! (సేవకుఁడు నిష్క్రమించును)

సుగ్రీ:- తారాదేవీ! ఇదిగో నాముద్రిక. నేను లంకాదండయాత్ర ముగించుకొని తిరిగి వచ్చువఱకు నీవే కపిసామ్రాజ్య భారమును వహింపుము. (సుగ్రీవుఁడంత తనముద్రికను తార కిచ్చును.)

తార:- (ముద్రికను గ్రహించి) నాథా! అవశ్యము మీయానతి నెఱవేర్చెదను. కాని నాకొక్క కోరికమాత్రమున్నది!

సుగ్రీ:- దేవీ! నీయభీష్టమును నెఱవేర్చుటకన్న నాకు ప్రియతర మొద్ది? అదెద్దియొ వెంటనే యానతిమ్ము.

తార:- మీరు శ్రీ సీతారాముల పట్టాభిషేకమహోత్సవమునకుఁ బోవునప్పుడు మమ్ముఁగూడ నయోధ్యకుఁ గొంపోవలెను సుఁడీ! (అని లక్ష్మణునివైపుజూచి చిఱునగవుతోననును.)

సుగ్రీ:- (చిఱునగవు మోమునఁదోఁప) దేవీ! నీ పవిత్రాశయము తప్పక త్వరలో సఫలమగుఁగాక! మనకీ లక్ష్మణుఁడుండ దులకుఁ దోడ్పడకుండునా? (అని లక్ష్మణుని భుజముపైఁ జేయి వైచి తట్టును)

లక్ష్మ:- (సుగ్రీవుని హస్తమును బట్టుకొని)

శా॥ నేఁడీరీతిని నీమనస్నేహముగనన్ • నేత్రోత్సవంబయ్యె, నే
గాడంజేసితి చిత్తమీగతిని నీ • కర్తవ్యముంజూపఁగా
నీడో మార్గము వేఱగాంచుటకు లే • కేమేమియోబల్కి ని
న్నాడంజూచిన మాటలెల్లమఱువన్ • న్యాయుంబగున్మిత్రమా!

సుగ్రీ:- లక్ష్మణా! నీవంటి నయకోవిదులైన సోదరులు రాముఁ కండయైయుండ నాపుండరీకాక్షుని కార్యములు సాధించు టెంతటిపని!

లక్ష్మ:-మిత్రమా ! నామాట కేమిగాని !

శా॥ సతులీ లోకముఁ గాల్చబుట్టిన మహా • సర్వంకషాభీలమా
హుతభుక్సంతతియంచు నెప్పుడును నే•నూహింతు నే! కాని యీ
గతి సామర్థ్యముఁజూపి కార్యములఁ జ•క్క౯ంజేయఁగాజాలి నేఁ
డతులానందముఁగూర్చు తారకిదె నే•నర్పింతు బద్ధాంజలి౯!

ఆహా ! ఈ జగంబున నిట్టి సాధ్వీమతల్లులింకను విలసిల్లు
దురు గాత !

తార:-(చిఱునగవుతో) సౌమిత్రి ! మీయగ్రజుని సంకల్పము
నెఱుంగుట కా నలువమోముల వేల్పునకుఁగూడ నశ
క్యము ! నిన్నిచ్చటికి కా యుదారుఁడు, సుగ్రీవుని మంద
లించుటకు మాత్రమె పంపియుండలేదు. స్త్రీలయెడ
నీకుండిన, తీవ్రప్రతికూలత పోగొట్టుటకూడ నా పరమ
శాంతుని మహాత్మ్రాశయమని యెఱుంగుము !

సీ॥ రాముని నడవికి రమణి • బంపెనటంచుఁ
గైకఁ జంపుదునని • కత్తి దూసి!
కామించివచ్చిన • కాంతను దయమాలి
ముక్కు౯ చెవులఁగోసి • ముప్పుదెచ్చి !
పలుమాట లనెనంచు • భర్తకై జెగడొందు,
వదినె నుగ్రాటవి • వదలిపోయి!
నిష్కారణంబుగ • కిష్కింధఁగల వాన
రాంగన • లెల్లరు హడలునట్లు

గీ॥ సింహ శార్దూల గర్జలఁ • జెలఁగ నిట్లు
పృథ్వయంగవలుండిన • పీడయనుచు
స్త్రీలనెల్లర సేవంపు • దృష్టిఁజూచు
తిరిగె లక్ష్మణ! సీతల • దిక్కనేఁడు!

సుగ్రీవమహారాజా! శీఘ్రముగ విజయము గైకొని
క్షేమముగ రండు.

(అని భర్తృ కరస్పర్శము గావించి తార నిష్క్రమించును)

(అంత లక్ష్మణ సుగ్రీవు లొకరిహస్తము లొకరుపట్టుకొని చిఱున వ్వులు మోమున దోఁప నంతఃపురమును వీడుచుండ)

## భరత వాక్యము

గీ॥ పతికి పౌరుషమొసఁగెడి • పడఁతి పడఁతి
ఇతర వెలఁదులనీ ధాత్రి • నెన్న నేల?
ఔర! ఈరీతిఁ దనభర్తృ • గౌరవంబు
చిత్రిణీ తారగాంచె వి • చిత్రఫణితి!

(తెరపడును)

చిత్రతారకము సర్వము సమాప్తము.

శ్రీ (శ్రీ) (శ్రీ)